# సమాలోచన

జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

వ్యవస్థాపకులు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 13 రాజమహేంద్రవరము 16-2-1990, 1-3-1990 సంచికలు 8, 9




—* ఈ సంచికలో *—



రాబోవు సంచికలో:- 1) పానుగంటివారి నాటక రచనాచమత్కృతి 2) ముత్యాలసరాలు-నవీన స్వరాలు 3) మన భారతం–పుస్తక సమీక్ష 4) హృద్యమైన పద్యం–దాని నేపద్యం 5) శ్రీ జవంగుల యల్లమందదాసుగారి రచనలు–ఒక పరిశీలన మొదలగునవి ఉంటాయి.


1, 16 తేదీలలో ప్రచురింపబడును.

సంవత్సర చందా రు. 12–00

6 మాసములకు రు. 6–50

విడి ప్రతి 0–60 పై.


సాహిత్య పరమైన రచనలకు సమాలోచన స్వాగతం!



శ్రీ వీరేశలింగం పురమందిర ధర్మకర్తృత్వమండలి ఈ నెల 4 నుంచి 8వ తేదీవరకు తమ పురమందిరంలో నవమ పుస్తక ప్రదర్శనను దిగ్విజయముగా నిర్వహించారు. పుస్తక ప్రదర్శనతోపాటు దేశభక్తులు, కళాకారులు రచయితల సభలను జరిపారు. వక్తృత్వపోటీలను, క్విజ్ కార్యక్రమాలను నిర్వహించారు.

తెలుగు విశ్వవిద్యాలయం, గౌతమీ గ్రంథాలయం, సాహిత్యనికేతన్ మున్నగు సంస్థలు "స్టాల్స్" పెట్టాయి.

ఈ సందర్భంగా శ్రీ జమ్మి రామారావు సంపాదకత్వంలో ప్రచురించబడ్డ "స్వేచ్ఛ" అనే ప్రత్యేక సంచికను శ్రీ జి.ఎస్.కృష్ణ, లా కళాశాల కార్యదర్శిని శ్రీమతి వి. శారద ఆవిష్కరించారు. పురమందిర ట్రస్టు కార్యదర్శి శ్రీ యాతగిరి శ్రీరామనరసింహారావు, అధ్యక్షులు శ్రీ పులిపాక కామేశ్వరరావు పర్యవేక్షించారు. ఛాయాచిత్ర ప్రదర్శనలు జరిగాయి.

కళాప్రపూర్ణ శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి అధ్యక్షతన శ్రీ మల్లంపల్లి శరభయ్య షష్టిపూర్తి అభినందన సభలో తెలుగు విశ్వవిద్యాలయం ఆచార్య బేతవోలు రామబ్రహ్మం, గౌతమీ విద్యాపీఠం సంస్కృత డిగ్రీ కళాశాల ప్రిన్సిపాల్ శ్రీ విశ్వనాథ గోపాలక్రిష్ణ, శ్రీ యర్రాప్రగడ రామకృష్ణ, స్వాతంత్ర్య సమరయోధులు శ్రీ వాడ్రేవు జగ్గరాజు ప్రభృతులు ప్రసంగించారు. ముఖ్య అతిథిగా పాల్గొన్న మాజీ శాసనమండలి సభ్యులు శ్రీ ఎస్.బి.పి.బి.కె. సత్యనారాయణరావు ప్రసంగిస్తూ మహాపండితులు, కవి అయిన శ్రీ శరభయ్యకు 'కళాప్రపూర్ణ' బిరుదుప్రదానంకై కృషిసల్పుతానని అన్నారు. అనంతరం భువనవిజయం జరిగింది.

శ్రీ సి.హెచ్. గురురాజారావ్ (అడ్వొకేట్) అధ్యక్షతన విమర్శకులు, అడ్వొకేట్ శ్రీ పోతుకూచి సూర్యనారాయణమూర్తి షష్టిపూర్తి అభినందనసభ జరిగింది. అనంతరం శ్రీ అవసరాల రామారావు శతజయంతిసభ వైభవంగా జరిగింది. జీవనసాహితి తరఫున శ్రీ పోతుకూచిని రఘునాధ్ పరిచయం చేశారు. శ్రీ ఎమ్.వి. నారాయణాచార్యులు శ్రీ ఆర్.బి. పెండ్యాల ప్రభృతులు ప్రసంగించారు. జర్నలిస్టు శ్రీ సత్యవోలు వరప్రసాద మూర్తి ప్రసంగిస్తూ నేటి యువతరానికి మహనీయుల జీవితచరితలు మార్గదర్శకం కావాలని ఆకాంక్షిస్తూ ఈ నాలుగు రోజులలో నిర్వహించిన శ్రీ బులుసు సాంబమూర్తి, జండావీరుడు శ్రీ దేవత శ్రీరామమూర్తి, ఆంధ్రరత్న శ్రీ దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, భారతీయ జనసంఘం అఖిలభారత అధ్యక్షపదవి నలంకరించిన మరియు మాజీ శాసనమండలి సభ్యులు శ్రీ అవసరాల రామారావుల శతజయంత్యుత్సవ సంవత్సరంలో వారి జీవితవిశే

## షష్టిపూర్తి సభలు

షాలను వెలికాష్టు చేయాలని ప్రభుత్వాన్ని కోరుతూ శ్రీ రామారావు జీవిత విశేషాలను వివరించారు.

మంగళవారం గుంటూరులో శ్రీరామ దండులో శ్రీరామనగర్ కేంద్రంగా స్వాతంత్ర్య సమరం నిర్వహించిన శ్రీ దుగ్గిరాల గోపాలకృష్ణయ్య శతజయంతి సభకు ట్రస్టీ శ్రీ న్యాపతి సుబ్బారావు అధ్యక్షత వహించగా బూరుగుపూడి శాసనసభ్యులు శ్రీ బదిరెడ్డి అప్పన్నదొర, ఆదర్శ ప్రజాసేవకులు డాక్టరు వావిలాల గోపాలకృష్ణయ్య ప్రభృతులు వారి జీవిత విశేషాలు వివరించారు. అంకితం సంస్థ తరఫున అష్టావధాని శ్రీ బులుసు వేంకట రామమూర్తి షష్టిపూర్తి పురస్కారం శ్రీయుతులు వై. రామకృష్ణ, పురాణపండ శ్రీనివాస్ ప్రభృతులు నిర్వహించారు.

గోదావరి వైన్సు క్లబ్బు సౌజన్యంతో సోమవారం సాయంకాలం శ్రీ న్యాపతి రాఘవరావు షష్టిపూర్తి అభినందన అనంతరం శ్రీ దేవత శ్రీరామమూర్తి శతజయంతి సభలో స్వాతంత్ర్య సమరయోధులు శ్రీ దాసరి సుబ్బారావు, ట్రస్టీ శ్రీ పతివాడ సూర్యనారాయణ ప్రభృతులు ప్రసంగించారు.

మొదటిరోజున ఆంధ్రకేసరి సెంటినరి జూనియర్ కళాశాల సౌజన్యంతో జరిగిన ప్రారంభోత్సవ సభలో కేంద్ర సాహిత్య అకాడమీ తెలుగు కన్వీనరు ఆచార్య వసంతరావు వెంకట్రావు పుస్తక ప్రదర్శనలను తాత్కాలిక గ్రంథాలయాలుగా అభివర్ణించారు. పెరుగుతున్న విజ్ఞానాన్ని ఆకళింపు చేసుకోవటానికి గ్రంథాలయాలే శరణ్యమని అన్నారు.

నవమ పుస్తక ప్రదర్శన విజయవంతమవాలని పురమందిరధర్మకర్తృత్వసమితి అధ్యక్షులు శ్రీ పులిపాక కామేశ్వరరావు ఆశీస్సుల నందజేశారు. మాజీమ్యునిసిపల్ చైర్మన్ శ్రీ పోతుల వీరభద్రరావు అధ్యక్షత వహించగా శ్రీ గన్ని సత్యనారాయణమూర్తి ముఖ్యఅతిథిగా పాల్గొని అభినందించారు. సాహితీరంగంలో ధర్మకర్తృత్వసమితి సేవలను వివరిస్తూ శ్రీ గంధం నాగసుబ్రహ్మణ్యం స్వాగతం పలుకగా ట్రస్టుబోర్డు సహాకార్యదర్శి శ్రీ రాతు సూర్యప్రకాశరావు వందన సమర్పణ చేశారు.

దేశభద్రత విషయంలో కేంద్రప్రభుత్వం తీసికొనే చర్యలకు మత,పర భేదాలు లేకుండా ప్రజల పూర్తిసహకారం వుంటుందని, యావత్ భారతదేశం ఒకటై నిలుస్తుందని, దేశసమగ్రతను కాపాడుకోవటంలో ప్రభుత్వం తీసికొనే నిర్ణయాలు మన ఆంతరంగిక విషయాలు గావున ఇరుగుపొరుగుదేశాలు కలుగజేసుకుంటే సహించేది లేదని హెచ్చరిస్తూ మాజీశాసనసభ్యులు శ్రీ పోతుల వీరభద్రరావు ప్రవేశపెట్టిన తీర్మానాన్ని సభ ఏకగ్రీవంగా ఆమోదించింద.

—శ్రీ సత్యవోలు



★ సమాలోచన ★

* జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక *

వ్యవస్థాపక సంపాదకులు : విద్వాన్ ఖులుసు సీతారామశాస్త్రి

Retired Telugu Lecturer, V. T. J. College, Rajahmundry.



# 1. దండకాలు - చిత్రకవితా విశేషాలు

—శ్రీ వైద్యం వేంకటేశ్వరాచార్యులు

తెలుగుకవిత ఆశు, మధుర, చిత్ర, విస్తరములని నాలుగు విధాలు. ఈ చతుర్విధ కవితలలో తెలుగుదండక వాఙ్మయమందుగల చిత్రకవితా విశేషాలను గురించిచెప్పటమే ప్రస్తుత వ్యాస ముఖ్యోద్దేశ్యం.

దండకం మధురకవితాశాఖకు చెందినదని విజ్ఞుల మతము. ఐతే క్రీ॥ శ॥ 1600 ప్రాంతంవాడైన లాక్షణికుడగు వార్తాకవిరాఘవయ్య తాను రచించిన 'లక్షణ దీపిక' అనే గ్రంథంలో చతుర్విధకవితా స్వరూపాలను చక్కగా వివరించినాడు. చిత్రకవిత్వాన్ని గురించి చెప్తూ వార్తాకవి రాఘవయ్య తన లక్షణ దీపికలో 'చిత్రకవిత్వం బన్నది పాదగోపనంబును .... ... తాళగతులును దండక వృత్తంబులును .... .... .... యాదిగాగల్గు బహువిధ చమత్కారంబుల చిత్రంబులు రచియించుటం జేసిన నది 'చిత్ర కవిత్వము' అని చెప్పినాడు. దీన్నిబట్టి పూర్వలాక్షణికుడగు వార్తాకవి రాఘవయ్యగారి దృష్టిలో దండకాలు చిత్రకవితకు చెందినవిగ భావింపవచ్చు. దండకశాఖకే చిత్రకవితా ప్రక్రియకు చెందినది కాగా ఇక దండకాలలో కూడా చిత్ర కవిత చోటుచేసికోవటం మరొక చిత్రం.

తెలుగులో చిత్రకవితను స్థూలంగా 1) భాషాశబ్దాక్షర చిత్రకవిత 2) బంధ కవిత 3) గర్భకవిత అనే మూడు విధాలుగా విభజింపవచ్చును. దండకాలలో ఈ మూడు విధాలైన చిత్రకవితలు కూడ చోటుచేసికొన్నాయి.

## 1. దండకాలు – భాషా శబ్దాక్షర చిత్ర కవిత

భాషాచిత్ర దండకాలు :-

ఇవి - అచ్చతెలుగు దండకాలు, తెలుగు కావ్యాల్లో కేవలం సంస్కృత దండకాలు, బహు భాషా దండకాలు, పామరభాషలో చెప్పిన చిత్ర దండకాలు మొదలైనవి.

అచ్చతెనుగు దండకాలు : అచ్చతెనుగు రచన చిత్రకవితకు చెందినదని కొందరు పరిశోధకులు తమ సిద్ధాంత గ్రంథాల్లో కూడ పేర్కొన్నారు. 'ఉ. అచ్చ తెనుంగు బద్దె మొకటైనను గబ్బములోన నుండినన్ హెచ్చని యాడుచుందురది యొన్నచు నేర్పున బొత్తమెల్ల నిట్లచ్చ తెనుంగునన్ నొడువవందుల చందమెఱుంగువారు నిన్ మెచ్చరో యబ్బురంబనరో మేలనరో కొనియాడరో నినున్'' (పొన్నికంటి తెలగన్న యయాతి చరిత్రము). ఈపద్యం, అచ్చతెనుగు పద్యరచన కూడ ఒక అబ్బురమైన రచనా విశేషమని తెలియజేస్తోంది. ఇట్టి అబ్బురమైన అచ్చతెనుగు దండకాలు - కూచిమంచి తిమ్మకవికృత నీలాసుందరీ పరిణయం, అచ్చతెనుగు రామాయణం; మరింగంటివారి చిలుకపడిగ శేని ప్రేరణం (అముద్రితం): అయ్యవకోట పార్థసారథి రచించిన సత్యవిజయం; అచ్చాంధ్ర దాశరథిచరిత్ర మొదలైన గ్రంథాల్లో ఉన్నాయి. అచ్చతెనుగుదండకం మచ్చునకు కొంతభాగం - ''ఓ కేలిశైల్వా! జగాజింకదాల్పా! నెకామేలు దాల్పా! కరంబొప్పగా నేను నేను నిర్పదకన్ మ్రోలఁ బెన్లిబ్బి ప్రోవబ్బు చందంబునన్నేను నీప్రాపువం జేర గంటిన్ .... .... సామి జన్నంపుగూడా నినుండిల్ల్వాజేడల్లి జేజేల పాన్నాజ్జయాయన్ నల్వపూజోణి

యున్ దిన్నగా నెంచి యుగ్గింపగా జాలరింకే వితం బొప్ప సేసేర్తు? ముత్వేల్పు వేల్పా జొహారుల్ జొహారుల్ జొహారుల్ గడున్"- (సత్యవిజయము 4-26).

పరిశోధకులు కొందరు అచ్చ తెనుగు రచనల నుచిత్రకవితగా చెప్పినారు కదా! కనుక తెనుగు కావ్యాల్లోని కేవల సంస్కృత దండకాలు కూడ చిత్ర కవితనే అవుతుందని కొందరభిప్రాయపడ్డారు. తెనుగు కావ్యాల్లోని కేవల సంస్కృత దండకాలకు కొన్ని ఉదాహరణలు: శ్రీనాథుని శృంగార నైషధం (4-138), తెనాలి అన్నయ సుదక్షిణా పరిణయం (2-73), భైరవకవి శ్రీరంగ మహాత్మ్యం (1-197), కూచిమంచి తిమ్మకవి రుక్మిణీ పరిణయం (4-83), తిరుమల బుక్కపట్టణం కిరీటి వేంకటాచార్యుల అచలాత్మజా పరిణయం (1-48) మున్నగునవి. తెలుగు కావ్యాల్లో రచింపబడ్డ కేవల సంస్కృత దండకాలు ఎంతో సుందరోభ్చితంగా సంస్కృతంలో రచింపబడ్డాయి. ఉదాహరణకు, శృంగార నైషధంలో విద్యాధిదేవత - గీర్వాణ భాషామతల్లి - అయిన వాణిని స్తుతించు సుందర్భాన గీర్వాణదండకమే రచింపబడింది. శ్రీరంగమహాత్మ్యంలో వాణీవల్లభుడగు బ్రహ్మనోట భైరవకవి గీర్వాణ భాషలోనే దండకాన్ని పలికించినాడు. ఇదొక రకంగా సందర్భోచిత చిత్ర రచనమే.

అష్టభాషల్లో కూడ దండకరచన జరిగింది. తాళ్ళపాక అన్నమయ్య మనుమడగు చిన తిరుమలయ్య వేంకటేశ్వర స్తుత్యాత్మకమైన అష్టభాషాదండకమును ప్రత్యేక కృతిగా సంతరించాడు. ఆ దండకమందలి అష్టభాషలలోని భాగాలు మచ్చునకు కొంత - 1) సంస్కృతం: 'శ్రీవేంకటాద్రీశ జీమూత నీలాంజనగ్రావ బృందప్రభా భాసమానాంగ .... మానసే సర్వదా' 2) ప్రాకృతము: 'దెక్వభో యిందిరాణాహకందుట్ట నీలగ్గ వారంగణాసివ్వ వారావుహేమేడ .... .... వాణంద మంతాహితుం' 3) శూరసేనము: నూరగ్గతుం నూరసేణే ససేణే సపక్ఖి సనేనాది దాపావళీ సెవ్వమాణో .... .... ఆనందకేళీ కళాణాహజేదుద్దిరం" 4) మాగధి: 'నాలాయణే మాగధాలాపశంశోశణగ్గిశ మగ్గోలు .... మంతోత్థియే శెవ్వ దేహాన్నమో' 5) పైశాచి (అపభ్రంశ): "అచ్చినికేసోపిసా నేపసం సెవ్వ .... .... సంతుత్థ సచ్చిత్త మా రఖ్ఖతుం" (6) ప్రాచీ: "దేనాహ సచ్యాళి కాకిన్న తానప్పవావహోలు మాతంక ... ఆలజాలచ్చలోకాన సంలఖ్ఖ యోజేతుతుం" (7) అవంతీ: "వెహ్లూశిరిగంతువాసా అబభ్భం సరాహిత్తి ... మంగిరేభద్ద సీహాసనే సంఠిదో సంఠితానందనో" (8) సార్వదేశీ: "హేధట్టి రొసవ్వ దేసేసుకం హ్లోకుడుం గేకు మంతత్తిరయే... ఇందిరాణాహులుం హ్ఇక్ సవ్వంగ రొకిక్కడీదొంగరీణాహ నారాయణో దేణమో దేణమో దేణమో."

పామరభాషలో హాస్యరస స్ఫోరకంగా రెండర్థాలనిచ్చే చిత్రమైన దండకాలు కొన్ని ఉన్నాయి. మచ్చునకు- గంట్లూరి నరసింహశాస్త్రి (19వ శతాబ్దం) రచించిన భాషీయదండకం. ఈ దండకం అహోబిలం తిరుణాళ సందర్భాన వివిధ జాతులవారు మాట్లాడుకునే తీరును రెండర్థాలు వచ్చేటట్లు వ్యవహారిక భాషలో రచింపబడింది. మచ్చునకు సిద్ధాంతులు మాట్లాడే వ్యావహారిక భాషగల దండకభాగం- "ఓం కొండిభొట్లూ! కుగంగాక్షి నేదే సమర్తాడ నేనే నిషేక ప్రయత్నంబు సేయింతుగా దీని పెండ్లప్పుడున్ యోనికూటంబు శోధించి పెట్టింది నేనేగదా!... సద్యోనితాంత ప్రభూత ప్రదంబైన యుద్వాహ కార్యాన్ని గావింపగా నేనెకా పోయియున్నాడ? ఈ కార్యసౌకర్యముం దీర్పు దీ శుక్లమందే శుభోదర్కలగ్నంబు కన్యాతులా మీదటన్ వృశ్చికం బొచ్చు అంగారక క్షేత్రమైతే ప్రశస్తంబు .. రెండు పాదాల మధ్యంగనే తెల్లగా చల్లగా జారిపోతుంది త్యాజ్యంబు"

పోరిపెద్ది వెంకటరాజుకవి (19వ శతాబ్దం) తిట్లదండకంలో ఉర్దూ పారశీక పదాలు చోటుచేసుకున్నాయి. మచ్చునకు- "హారామా గులామా దగాకోరు ఫాజీ దగుల్బాజి ముర్దారువాల్లా దివానాతు బేమాని లుచ్చా నారాజ్ కోరుబచ్చా... నీయమ్మనుం గ్రుమ్మ నీయబ్బనుం ద్రొబ్బ నీయత్తనుం మొత్త నీచెల్లెలిం గొట్ట... బజారీ... కాఫిర్"

నిరంకుశ ప్రభుత్వాధికారుల, గ్రామాధికారుల దుండగాలను సురవరం ప్రతాపరెడ్డిగారు 'వెట్టివాని పాట' అనే పేర దండకంగా రచించిరి. మిశ్రభాషాశైలి ఆ దండకంలో గోచరిస్తుంది. మచ్చునకు కొంత- "ఏమి గ్రాచారమో రామరామా యికెవ్వారితో చెప్పినా యేమి లాభంబు మారాత యిట్లుంది రెడ్లొక్కరే కాదు పట్వారి పోలీసుపట్టేళ్ళు తాసీలుదారంటరో మొద్దుమీనంట తాలూకుదారంట కచ్చేరి బంట్రోతులంటా అమీన్ సాబు యింకా తమాషైన హొద్దార్లు వస్తారు."

ఇంతవరకు భాషాపరమైన చిత్రదండకాలు కొన్నింటిని చూశాం. ఇక శబ్దాక్షరచిత్ర దండకాలను గురించి తెలుసుకుందాం.

## విరోష్ఠ్య దండకాలు :

ప ఫ బ భ మ వ ఒ ఓ ఔ ఉ ఊ- ఇవి పెదవుల సాయంతో పలుకబడే అక్షరాలు. వీటిని ఓష్ఠ్యాలంటారు. ఓష్ఠ్యాలు పరిహరించి రచింపబడిన దండకాలు నిరోష్ఠ్యదండకాలు.

తెలుగులో తొలి నిరోష్ఠ్య దండకం కొరవి గోపరాజు రచించిన(క్రీ.శ.1384) 1429) 'సింహాసనద్వాత్రింశిక' (4.24) లో కలదు. ఆ దండకంనుండి మచ్చునకు కొంత- "జయకృష్ణ! జయకృష్ణ! కృష్ణ! స్థిరాస్వాదనస్థాన, నానాదిన ధ్యాన, నానానితానేక సేనాజోనీక రథ్యాలి, రథ్యాళి సన్నాహ సన్నద్ధ రాజన్యతానన్య, సాదృశ్యదృశ్యాంగ, హృష్యజ్జరాసంధ, సంధాన యంత్రాది యత్నైకసాదాయనీతి శితాసారసారాం తరజ్ఞాన దాసాహితధ్యాన... గీత నీరేజ సంచారిణీ రాజరాజాగ్రణీ"- ఇది పెద్ద దండకం. దీంట్లో కొంత ముక్తపదగ్రస్త చిత్రకవితకూడఉంది.గణపవరపు వేంకటకవి (17వ శతాబ్దం) రచించిన ప్రబంధ రాజ వేంకటేశ్వర విజయవిలాసంలో (832) చేతవోలు సంస్థానంలో ఉండిన ముదుంబ లక్ష్మణాచార్యుల (19వ శతాబ్దం) నందనందన విలాస మనే నామాంతరంగల లక్ష్మణాకల్యాణంలో,మిర్యాలగూడెంతాలూకా విభురాంపేట వాస్తవ్యుడు గోవర్ధనం వేంకటనృసింహాచార్యులు (19వ శతాబ్దం) రచించిన సారంగశైల మాహాత్మ్యంలో, పుష్పగిరి తిమ్మన్న రచించిన (18వ శతాబ్దం) సమీరకుమార విజయంలో (4-145) నిరోష్ఠ్య దండకాలున్నాయి. పాలకొల్లు వాస్తవ్యులు కడియుం తమ్మన్నకవి నిరోష్ఠ్యశంకర జనార్దనదండకాలు రచించిరి. ఇట్లెందరో కవులు నిరోష్ఠ్య దండకరచన చేసినారు. పుష్పగిరి తిమ్మన్న రచించిన సమీర కుమార విజయంలో (4-145) ఉండే దండకాన్ని ముద్రాపకులు అక్కడక్కడా మార్చినారు. ఆ మార్పు నిరోష్ఠ్యాలను ఓష్ఠ్యాలుగా చేయటం. "హల్ల కాస్త్రాగ్రి దారిన్ గ్రసించన్ వ్యాప్తికేళితాసక్తి రక్షించ గంజాసనాఖ్యుం జగజ్జాతసృష్టిన్ ఘటించన్ నటించన్"అని ఉండినచోట్ల గ్రసింపన్, రక్షింప, ఘటింపన్, నటింపన్ అని పరిష్కర్తలు దిద్దినారు. (చూడు- వావిళ్ళవారి ప్రతి-పుట 122). మొఱ్ఱో! నేను నిరోష్ఠ్య దండకాన్ని రచిస్తున్నానని కవి మొత్తుకున్నా సరే! చిన్నయసూరి గారి "అగమాన్య చకారంబుల కద్వయుక్తంబులకు ముత్తుపరంబగునపుడు పవలగు" (బాలవ్యాకరణం-క్రియా-88)అనే అనుశాసనంవల్ల దండకంలోని నిరోష్ఠ్యాలను ఓష్ఠ్యాలుగా మార్చినారు. చకారాలను పకారాలుగా దిద్ది నిరోష్ఠ్యచిత్ర కవితకు అపకారాలు చేసినారు. (ఈ విషయం అరుద్రగారు చెప్పినారు).

- (సశేషం) -

## 2. బాపిరాజు సాహిత్యంలో జంటపదాలు

(గత సంచిక తరువాయి)

38. మూటా_ముల్లీ :

మూట=బట్టలు లోనగువాని మూడిసరకులు పోగుచేసి కట్టిన మూడి. ముల్లి=ధనం మూడి. 'నీ మూటా ముల్లీ సర్దుకో' (భోగీర లోయ, పు. 89).

### V వ్యతిరేకార్థాలు గల జంట పదాలు :

39. పెద్దలు_పిన్నలు :

పెద్దలు=గొప్పవారు, వృద్ధులు. పిన్నలు=చిన్నవారు. "పెద్దలూ పిన్నలూ కర్రలు పుచ్చుకొని పచ్చలయ్య పొలానికి నడక సాగించారు' (అంజలి, పు. 40).

40. మంచీ_చెడ్డా :

మంచి=మేలు. చెడ్డ=కీడు. 'మంచీ చెడ్డా చూచుకోవడానికి ఆ నగరం వచ్చినప్పుడు...' (వింధ్యాచలం, పు. 12).

41. మెట్ట_పల్లాలు :

మెట్టపల్లాలు = ఎగుడు దిగుడు. 'ఆ నేలంతా మెట్టపల్లాలుగా (వుంది' భోగీర లోయ. పు. 28)

42. రానూ_పోనూ :

రాను=రావడం. పోను=పోవడం. 'రానూ పోనూ ఖర్చులక్రింద...' (భోగీర లోయ, పు. 76).

43. వెలుగు_నీడలు :

వెలుగు=ప్రకాశించు. నీడ=ఛాయ. '....తెలుగు నీడలై మహాకృతులయినవి' (అంజలి, పు. 20).

### VI సమానార్థంగల జంటపదాలు:

44. ఇరుగు పొరుగు :

ఇరుగు=ప్రక్క, సామీప్యం. పొరుగు=చేరువ, దగ్గర, పార్శ్వస్థం. ఇరుగు పొరుగు=చుట్టుప్రక్కలు, ఇంటికి ఇరుప్రక్కల నున్నవారని అర్థం. 'ఇరుగు పొరుగు వాళ్ళంతా మూగి అడ్డంపడి కొట్టుకొని ఇంటికి లాక్కువచ్చినారు' (తూలికానృత్యం, పు. 66)

45. చడీ_చప్పుడూ :

చడి=అలజడి, జాడ. చప్పుడు=శబ్దం, ధ్వని. చడిచప్పుడు=చప్పుడు లేకుండ, ఎవరికీ తెలియకుండా, గప్పుచిప్పు మనకుండా. 'ఎవ్వరికీ తెలియకుండా వెళ్ళిపోదాం' (వింధ్యాచలం, పు. 58).

46. వంకర_టింకర :

వంకరటింకర=నానావిధమైన వక్రం. 'వక్ర' నుండి వచ్చింది వంకర 'టింకర' శబ్దం, వాక్యంలో 'వంకరశబ్ద' పూర్వకంగానే కన్పడుతుంది. 'అబూ నగరానికి రోడ్డు వంకరటింకరగా పైకి ఎక్కుతుంది' (అంజలి, పు. 59).

## VII అర్థపరిణామం గల జంట పదాలు :

47. ఆస్తి-పాస్తులు :

ఆస్తి (సం)-అస్తి=ఉంది అని అర్థం. 'అస్థి' అనే సంస్కృతపదం తెలుగులోకి వచ్చేసరికి 'ఆస్థి'గా మారింది. అర్థంలో కూడా మార్పు వచ్చింది. ఆస్తి=సొత్తు, సర్వస్వం. ఆస్తులు రెండు రకాలు. 1. స్థిరాస్తి (భూములు, ఇల్లు మొదలగునవి) 2. చరాస్థి (డబ్బు, బంగారం, వెండి మొదలగునవి). ఆస్తిపాస్తులంటే 'గుడ్స్ అండ్ చాటిల్స్' అని బ్రౌని, దేశ్యశబ్దమని శ.ర. 'అమృతం రంగరించిన ఆనందాలు మాత్రమే వారి ఆస్తిపాస్తులు' (తరంగిణి, పు. 112).

48. దేవతలు-దెయ్యాలు :

'దయ్యం' దైవశబ్దానికి వికృతి. దెయ్యం=భూతం. మొదట్లో 'దయ్యం' శబ్దానికి 'దేవుడు' అని అర్థం కూడా ఉంది. కాలక్రమేణా దయ్యమంటే భూతమని అర్థవిపరిణామం వచ్చింది. తిక్కన దయ్యం శబ్దాన్ని 'దేవుడు'గా ఉపయోగించాడు. 'దయ్యము వెత్తికోలు దువిదాఁకట గాదె భుజంగ భంజనా' (ఉద్యోగ పర్వం-తృతీయాశ్వాసం-67 పద్యం-4వ పాదం). 'దేవతలు దెయ్యాలు జ్ఞాపకం వచ్చి, ఇక యిక్కడ ఉండకూడదని అనుకుంటూ ఆ గోడలన్నీ దాటి బయటపడ్డాం' (తరంగిణి, పు. 67).

## VIII నిందార్థంగల జంటపదాలు:

49. భయం-గియం :

'నిందయం దామ్రేడితంబు నాద్యక్షరమునకు హ్రస్వ దీర్ఘంబులకు గిగీలగు' (బాలవ్యాకరణం)-ప్రకీర్ణ పరిచ్ఛేదం, సూ. 22). భయం+భయం ఇట రెండవసారి యుచ్చరించిన 'భయం' అనునది ఆమ్రేడితం. ఆమ్రేడితంయొక్క తొలి హ్రస్వాక్షరమగు 'భ' వర్ణంనకు ఈ సూత్రంచే 'గి' వర్ణమై 'గియం' అగును. భయం=వెఱపు, వెఱపు పుట్టించునది. 'భయం గియం నై' (అంజలి, పు. 9()).

50. మడీ గిడీ :

నిందార్థంలో రెండో పదాదిలో గిగీలు వస్తాయి. మడి+మడి ఇక్కడ రెండవ సారి ఉచ్చరించిన 'మడి'లోని 'మ' అను దానికి 'గి' పరమై మడి గిడి అని అగును.

మడి=మడత, మడుగు వస్త్రం. పరిశుద్ధం. 'ఆచారాలు మాత్రం పైపైన తేడాలేగాని అసలు మడీగిడీ వారికీ వీరికీ ఒకటే' (వింధ్యాచలం, పు. 12).

ఈవిధంగా జంటపదాలు బాపిరాజు కథల్లో అత్యంత సహజ సుందరంగా చోటుచేసుకొని అతని రచనావిన్యాసానికి ఎంతగానో తోడ్పడ్డాయి.

(అ) ఆధార గ్రంథాలు :

1) ఆంధ్ర-తమిళ-కన్నడ త్రిభాషా నిఘంటువు.
2) ఆంధ్ర నామసర్వస్వము అను తెలుగు నుడికడలి.
3) తెలుగునుడి-కడలి-అచ్చా తెలుగు నిఘంటువు.
4) తెలుగు పలుకుబడులు-తీరుతెన్నులు, ప్రకాశచంద్రశతాప్తం.
5) తెలుగు భాషాచరిత్ర-భద్రిరాజు కృష్ణమూర్తి.
6) తెలుగు వ్యుత్పత్తికోశం.
7) నుడి-నానుడి-తిరుమల రామచంద్ర.,
8) పదబంధ పారిజాతము.
9) బ్రౌను తెలుగు నిఘంటువు.
10) భాషోత్పత్తి క్రమము-భాషా చరిత్రము : కోరాడ రామకృష్ణయ్య.
11) మాండలిక పదకోశము-మరవూరి కోదండరామిరెడ్డి.
12) విద్యార్థి కల్పతరువు.
18) శబ్దరత్నాకరము-తెలుగునిఘంటువు.
14) సూర్యరాయాంధ్ర నిఘంటువు.

(ఆ) వ్యాసాలు :

15) జంటపదాలు : ఒక పరిశీలన-భారతి, మే 1974, బండి నాగరాజు.
16) తెలుగులో జంటపదాలు - స్రవంతి, అక్టోబరు, 1985, సంపుటి 32 సంచిక 7. కె.వి.ముకుందాచార్యులు.

(* * *)

## 3. సూరంపూడివారి "నా ప్రణయిని"

—శ్రీ పి. మోహన్

రెండు ప్రపంచయుద్ధాల మధ్యకాలంలో తెలుగు భావకవిత, హిందీలో ఛాయావాదం ఆవిర్భవించాయి. అయితే భావ నవ్యతగల భావకవిత సుందరమైన పద్యాల్లోనే బహుధా వెలుగుచూశాయనాడు. సుమారు పుష్కర వత్సరాల క్రితం జాలువారిన శ్రీ సూరంపూడివారి కలం బిడ్డగా ఆవిర్భవించిన 'నాప్రణయిని' మాత్రం మాత్రా ఛందస్సులో వచన కవితగా సువ్యక్తరాలైంది. భావకవితా భూరుహానికి అయకొమ్మలు. ప్రేమ, ప్రకృతి, సంఘ సంస్కరణా, భక్తి, దేశభక్తి, స్మృతీ అందునా ప్రేమ కవిత్వపు కొమ్మ నిండైన ఫలద్వయంతో సింగారం పంచింది. లోన ప్రేమ అంగారమైనా పండించిందంతా సింగారమైన బంగారమే. అయితే ఓ ఫలం సుమం సంయోగం. రెండోది వియోగం.

'ప్రేమ్ పానేమే సహీఁ! బల్కి న పానేమే హై!' అంటాడు హిందీ కవి. ఇది విప్రలంభానికి మకుటం పెట్టే వాక్యమణి, సంయోగంలో ప్రేమ, క్షణికానం

దాన్నివ్వగా విప్రలంబంతో ప్రణయం వింతరంగులీనుతూ చిరంతనానందామృతాన్ని పంచుతుంది. అమలినమైన అమరానుభూతిని మిగుల్చుతుంది. కవితా భావుక హృదయం గల కలం కమ్మని కవితల్ని కనికడానిలా మెరుస్తుంది, అక్షరమై నిలుస్తుంది. అటువంటి కవితా భావుక హృదయం గల శ్రీ నూరంపూడి వారి గుండెలోతుల్లోంచి జాలువారిన ప్రేమామృతవాహిని "నాప్రణయిని".

సంగీతం, సాహిత్యం రెండు కళ్ళుగా గల శ్రీ నూరంపూడి వారు వీణను వాయిస్తారు. హృదయవీణను మీటి ప్రేమ మాటలు పలికిస్తారు. మగరూపం ధరించిన మాటల రాణిలా 'మనోజ్ఞంగా మనసువిప్పి అక్షరాలా అక్షరాల జాతి రాళ్ళు కురిపిస్తారు. ప్రేమరతనాలను పంచుతారు.

"మధుర కవితల మల్లెతోంతర మించు నవ్వుల మంచి కవిదొర" ఆచార్య సి.నా.రె. ది 'నాప్రణయిని' అనే యీకృతి బహుకృతి కావడం ఉచితం, సముచితం. ప్రేమాక్షరాంకితమే.

పదవ యేటనే శ్రీ నూరంపూడివారి కథ ఆంధ్రపత్రికలో ప్రచురించబడిందంటే, వారి నిండు యవ్వనంలోనే మానస సరోవరంలో ప్రేమ కవితా గంగ కన్నువిప్పడంలో ఆశ్చర్యంలేదు. ఇది గేయ కావ్యమని నుడివిన శ్రీ నూరంపూడి 'నాప్రణయిని'లో నాయిక తనదేనని చెప్పారు. ఔను! తనదైనప్పుడే తమ కవితలో తమ అనుభూతిని తనదైన భాణిలో తల్లీనమై తంగేటి జున్నులా అందించగలరు. తమ కవితా తన్వంగిని తడిమి, తడిమి తరచి, తరచి తమకంతో యమకంతో తటిల్లతలాంటి, తలిరుబోడుల్లాంటి భావాల తత్వాలను తమసొంతం చేసుకొని తీపులను పంచగలరు! తన్మయులై చిన్మయులై తాము తరించి యితరులను తరింపజేయగలరు. వ్యక్తిగతానుభూతిని సమష్టిగతం చేయగలరు. ఈ నాప్రణయినిని పఠించిన ప్రతీ యువ ప్రణయ హృదయం తమ తమ ప్రణయినిని హృదయాధిష్ఠాత్రి దేవతగా ప్రతిష్ఠించుకోగలరు. ప్రేమ కవితా సామ్రాజ్యానికి తమ తమ ప్రణయినులను పట్టం కట్టగలరు.

సాధారణంగా ఏరికైనా ప్రణయిని ముందుగా పరిచయమౌతుంది. (ప్రణయం మొగ్గతొడుగుతుంది) తరువాత 'ముఖాముఖి'లో మరింత దగ్గరౌతుంది. పాడులోకం రెండు హృదయాలను విడదీస్తుంది. 'విరహం' రెక్క విప్పుతుంది. యోగం అనలమై వేడెక్కిస్తుంది. విషాదం విశ్వరూపం ధరిస్తుంది. 'వేదాంతం' తన పరిష్వంగంతోనికి తీసుకొని ఓదారుస్తుంది. అమలిన శృంగారం అందలమెక్కుతుంది. ఆనందపు అవధుల్ని చూపి పరమపదానికి యీ విధంగా సోపానాలుకట్టే కవితా హృదయం కల కలం శిల్పి ప్రేమకు పరాకాష్ఠగా అద్దం పడతారు. అదే శ్రీ నూరంపూడి వారు చేశారు. ప్రణయ తపస్వి నాయనిలా తాము వెంకటేశ్వరులై అలివేలుకై మేలు కవితల్ని మేలు బంతిలా తమలో మేల్కొల్పి మేలు తలపులతో కవితా మేలిమి బంగారం పండించారు.

ప్రేమ భౌతికమైనప్పుడు శృంగారం! ఆధ్యాత్మికమైనప్పుడు శాంతం! జీవాత్మ - ప్రియుడు. పరమాత్మ - ప్రియురాలు. పరమాత్మ నుండి విడబడ్డ ప్రియుడు వియోగాగ్నిలో నుండి సంస్కరింపబడతాడు. పరమాత్మలో చేరి శాంతి సామ్రాజ్యంలో ఓలలాడి భాసిస్తారు. ప్రణయ తపస్వి శ్రీ నూరంపూడి వారికి అన్నింటినీ మించి - ఆధ్యాత్మిక విషయంపై ఆసక్తి మెండు కదా! అందుకే తమ ప్రణయిని సాహిత్యం, సంగీతం విరిసిన చోటున పరిచయం మేర్పరచుకొని, వేదాంతులను సైతం శాంతి పొందడానికి మార్గం చూపే ప్రేమబద్ధ నిలిచిపోతారు. అభిరామమైన ప్రేమ సామ్రాజ్యానికి రాజ్ఞిగా తన ప్రణయినిని ప్రతిష్ఠించి రాగినుండి విరాగిగా విమల ప్రేమ తపస్సునుండి విశిష్ట వైరాగ్యపుతురీయావస్థను మరలుతారు. విజయులై ప్రేమ విజయం సాధిస్తారు.

'రాధా మాధవ్! మాధవ రాధా' అన్నట్లు సంయోగంలో వియోగంలో ఇద్దరొక్కరై ఒక్కరిద్దరైనప్పుడు సైతం ఒక్కరై ఉండి పోతారు తనువులు వేరైనా తమ మనసొకటేనని నిరూపించుకుంటారు. తరతరాల ప్రేమ తత్వానికి తరగని సామ్యాలు పంచుతారు. ఆ మెరికమై మృదుమధుర కావ్యమాలను అంకితం చేస్తారు.

మొదటి చూపులోనే అనురాగం అలలు దిద్దుతోగా చక్రాల్లాంటి ఆమె కన్నుల్లో స్తంభించిన కాలచక్రాన్ని దర్శించి ఆమె సౌందర్య ఝరిలో స్నానమాడుతారు. అద్దంలోని తన ప్రతిబింబంలో ఆమెను చూసి అద్వైతసిద్ధిని పొంది ప్రణయబీజాలను మనోరంగంపై నాటుతారు. వాస్తవంతో దూరమైనా, ఊహల్లో దగ్గరౌతారు.

వినిపించే రాగాలంకన్నా వినిపించని రాగాలు మిన్న అన్నట్లు - నిట్టూర్పుల్లో కావ్యగీతికలల్లుతుంటారు. 'వయస్సంధ రాధ' లా మనస్సు డోలాయమాన జగత్తులో విహరిస్తుంది. ఆకాశపు వీగలలో చంద్రముఖిని దర్శిస్తారు. ముఖాముఖిలో అభ్యంగన శుభ్రమైన వేణీ చుంబనం చేసి పవిత్ర ప్రేమకు నాందీ పలుకుతారు. ఆమె సాన్నిధ్యంలో చుక్కల్లో పడవని సాధిస్తారు.

విరహంలో అనుభూతుల 'అకౌంటు ఓపెన్' చేస్తారు. ఎంతైనా ఎస్బీఐ. ఆఫీ సరుకదా! నిన్నటి నిషా మళ్ళీ కావాలని అనుభూతులు నెమరువేసి కొంటారు. అహరహం ప్రణయినిని తలచుటే విరహమని నిర్వచనం చేస్తారు. భావనకు భాషలు అడ్డురావని నిరూపిస్తూ ఆంగ్లంలో అనుభూతిని వ్యక్తీకరిస్తారు. తీపి కారంగా కారం తీపిగా మరువరాని స్వానుభూతిని తెలుపుతారు.

హిందీలో భారతేన్దు హరిశ్చంద్ర 'చంద్రావళీ' నాటికను రచించారు. అందులో కృష్ణ వియోగతప్త హృదయ అయిన చంద్రావళి 'నీ పేరేంటంటే - నాపేరు 'ప్రేమ' అంటుంది. ఇంకా ఊరు - ప్రేమ, ఎక్కడికి కళ్ళున్నావ్? ప్రేమవద్దకు, ఎందుకు-ప్రేమకై అంటుంది. అట్లా - అంటారు నూరంపూడివారు.

నోటికి తినడానికి హితవులేదు. కంటికి కునుకోను నిదుర రాదు! అంటూ ప్రేమ తీవ్రతను వ్యక్తంచేస్తారు. ప్రేమ జ్వరంలో మండిపోతారు. ముక్కంటి తలపూవు లాంటి చంద్రముఖిని సదాశివునిలా నెత్తిపైనిడుకొని చల్లబడతారు. మళ్ళీ వేడెక్కి ఆవిరై అదృశ్యమై పోతానంటారు.

వియోగంలో ఏ జన్మలో ఎవరిని విడదీసినామోనని వాపోతారు. జన్మ జన్మల కర్మానుభవం ప్రాప్తాన్ని గూర్చి ఉటంకిస్తూ తమకు గల కర్మసిద్ధాంత విశ్వాసాన్ని వెలిబుచ్చారు. రక్తాన్ని కన్నీరుగా పండించి మనుగడ నిండా పంచుకొంటారు. కన్నీటినే కలంలో నింపి విషాదగీతి వ్రాసికొంటూ స్థాణువై పోతారు. రసజ్ఞులై కాంతిని పొందుతారు. దూరాలెరుగని మానసిక సంయోగంలో అనుభవైక్యమూ ఆత్మానందాన్ని పొందుతారు.

మనుకారాలు అశేవి కారాగారా అంటూ వేదాంతిగా మారిపోతారు.

కలం, వర్గం, దూరం, కోరిక, అడ్డురాని, 'శక్తి అణువులుగా' ప్రేయసీ ప్రియులు ఒకటౌతారు. ఆ అద్వైత స్థితియేప్రేమకు ఫలశ్రుతి. బంధాల్లేని ప్రేమకూ, ఛందాల్లేని కవితకూ జీవంపోసి ప్రణయినిలో తను లీనమై పోతాడు.

నిష్కళంకమైన ప్రేమకు వ్యాఖ్యానం లాంటిది నాప్రణయిని. ఇందులో వ్యక్తీకరణ సౌలభ్యం వుంది. తత్వను పూర్ణ శైలివుంది. మనోజ్ఞమైన శయ్య వుంది. సులలిత పదజాలం సుందరంగా సుమించింది. తొలి మలి పలుకుల్లో శ్రీ నూరంపూడివారి హృదయం ప్రతిబింబించింది. అంత్యాను ప్రాస అంతటా వ్యాపించిన యీ 'నా ప్రణయిని'లో అక్షర నృత్యం అందంగా అగుపిస్తుంది.

మూడు పదుల పుటల్లో ముచ్చటగా అక్షరాల ప్రేమకన్యలు అందగించిన యీ నా ప్రణయినిలో - వయస్సులో ఆకర్షణలనుండి విడివడి ప్రేమసామ్రాజ్య చిరంతనత్వాన్ని చూపి పాఠకుల హృదయాలను రంజింపజేశారు. బుల్లి కీట్సులా శ్రీ నూరంపూడి తన అక్షర శిల్పానికి ఆదర్శంలా జాకెట్టుపై అందచక్కని శిలా శిల్ప ప్రతిమను ప్రతీకగా నిల్చిన ప్రేమమూర్తిని ముద్రింపించడం పాత్రం అందాన్ని మరింత పెంచి ప్రేమకు భాష్యం చెప్పింది.

ముద్రారాక్షసాలు లేని యీపాత్రం శ్రీ నూరంపూడివారి ప్రేమ హృదయానికి తాత్త్విక చింతనకూ ప్రతిబింబం. ప్రణయ జీవిత యానం ఓ. సారాలంకారం లాంటిదని నిరూపించిన యీ 'నాప్రణయిని'లో ప్రేమ కెరటం కాంతిసముద్రంలా విజృంభించింది. ఆనందం పరవళ్ళు తొక్కింది.

అయిదు దూకలకే అక్షరానందాలు పంచే 'నా ప్రణయిని' రచయిత శ్రీ నూరంపూడివారు మరిన్ని మంచి కవితల్ని రచించి ప్రేమ సోమయాజిగానే కాకుండా సంస్కార భావ కృతు గత సమిధగా మండి మరిన్ని కవితల జ్వాలలను పంచి వెలుగు లీనాలని ఆకాంక్షిస్తూ. ... ...

( * * * )

# 4. కొన్ని సూక్తుల పూర్తి పాఠాలు

—శ్రీ పోలేపెద్ది రాధాకృష్ణమూర్తి, ఎం.ఏ., ఎం.ఫిల్.

సాధారణంగా మన మేదైనా ఒక విషయాన్ని ఇతరులకు వివరించేటప్పుడు మన అభిప్రాయాని, వుపబలకంగా పూర్వ కవికృతమైన కొన్ని శ్లోకాలనూ పద్యాల నుదాహరిస్తుంటాం. శ్రోతలు కూడా వారి పట్ల తమకు గల ప్రత్యయాన్ని పురస్కరించుకొని మన అభిప్రాయాలను మన్నిస్తుంటారు. ఇక్కడ విశేష మేమిటంటే, మనమప్పుడప్పుడూ పూర్తి శ్లోకాలను కాకుండా ఒక్కొక్క పాదాన్నో, పాద భాగాన్నో ఉదాహరిస్తుంటాం. అవి ఆ విధంగానే ప్రచారాన్ని పొందుతై, మిగిలిన మూడు పాదాలు మఱుగున బడి పోతై, అది ఎంతవఱకు వస్తుందంటే కాలాంతరంలో వక్తలకూ, శ్రోతలకు గూడా ఆ మిగిలిన పాదాలు తెలియని స్థితి ఏర్పడుతుంది. ఛందః పరిజ్ఞానమున్న కొంత మందికి మాత్రం ఆ వాక్యాలు ఏవో శ్లోకాలకు, పద్యాలకు సంబంధించిన పాదాలని మాత్రం తెలుస్తుంది. మిగిలిన వాళ్ళకది కూడా తెలియదు. ఏవో వచన వాక్య మనే అనుకొంటారు. అటువంటి సూక్తులు కొన్నింటికి సంబంధించినపూర్తి పాఠాలను తెలుసుకొందాం!!

* * *

ఒక విషయంలో – మంచిగానీ, చెడుగానీ, – పెద్దవారి లాగానే పిల్లలు, పై అధికారిలాగానే క్రింది ఉద్యోగులు నడుస్తున్నట్లయితే, "యథా రాజా తథా ప్రజా" అంటాం. దాని పూర్తిపాఠ మీ విధంగా వుంటుంది.

శ్లో॥ రాజా రాక్షస రూపేణ
వ్యాఘ్ర రూపేణ మంత్రిణః।
సేవకాశ్చ శ్వరూపేణ
యథారాజా తథాప్రజా॥

కొన్ని వ్యవహారాల పట్ల రాజు రాక్షసుని లాగా ప్రవర్తించినట్లయితే, మంత్రులు పెద్దపులుల లాగానూ, సేవకులు శునకాల లాగానూ ప్రవర్తిస్తారు. రాజులాగనే ప్రజానీకం గదా! అని దీని భావం.

బాగా కష్టపడి పని చేయాలని ఇతరులకు చెప్పేటప్పుడు 'కృషితో నాస్తి దుర్భిక్షం' అనే సూక్తిని ప్రయోగిస్తుంటాం.

శ్లో॥ కృషితో నాస్తి దుర్భిక్షం
జపతో నాస్తి పాతకం।
మౌనేన కలహం నాస్తి
నాస్తిజాగరతో భయం॥

అనేది పూర్తి శ్లోకం. కష్టపడి పని చేసే వారికి – లేదా వ్యవసాయం చేసే వారికి– కఱవు, జపంవలన పాపమూ, మౌనంగా వుండటం వలన తగాదా జాగ్రత్తగా, మెలకువగా వుండటం వలన భయమూ వుండవని తాత్పర్యం.

ఒక కావ్యాన్ని గురించి పరిశీలన చేసేటప్పుడు, సాహిత్య చరిత్రను, సాహిత్య విమర్శను బోధించేటప్పుడు 'నాఽనృషిః కురుతే కావ్యం' అనే విషయాన్ని పదే పదే చెబుతుంటాం.

శ్లో॥ నాఽనృషిః కురుతే కావ్యం
నాఽ గంధర్వ స్సురూపధృత్॥
నాఽదేవాంశో దదాత్యన్నం
నాఽవిష్ణుః పృథివీపతిః॥

అని దాని పూర్తి శ్లోకం. ఋష్యంశ లేనివాడు కావ్యరచన చేయలేడు; గంధర్వాంశ లేనివాడు సౌందర్య వంతుడు కాలేడు; దేవాంశ లేనివాడు అన్నదాత కాలేడు; విష్ణ్వంశ లేనివాడు రాజ్య పాలకుడు కాలేడని దీని భావం. ఈ శ్లోకంలోని నాలుగవ పాదాన్ని కూడా మనం అడపాతడపా ప్రయోగిస్తూనే వుంటాం.

ఎవరైనా ఒక విషయంలో అతిగా ప్రవర్తిస్తున్నట్లయితే 'అతి సర్వత్ర వర్జయేత్' అని చెప్పి, వారి నా మార్గం నుండి మఱల్చడానికి ప్రయత్నిస్తాం.

శ్లో॥ అతి దానా ద్బలి ర్బద్ధో
హ్యతి మానా త్సుయోధనః।
వినష్టో రావణో లౌల్యా
దతి సర్వత్ర వర్జయేత్॥

అనే శ్లోకంలోని పాదమిది. అతిగా దానంచేసి బలిచక్రవర్తి, అత్యభిమానం- దురభిమానం–వలన దుర్యోధనుడు, స్త్రీ లౌల్యాతిశయం వలన రావణాసురుడు నష్టపోయారు. కనుక అతి అనేది దేనిలోనూ పనికి రాదని సారాంశం.

'వినాశకాలే విపరీతబుద్ధిః' అనేది కూడా ఈ శీర్షిక క్రింద చెప్పుకో వలసిన విషయమే!

శ్లో॥ న భూత పూర్వో న చ కేన దృష్టో
హేమ్నః కురంగో న కదాపి వార్తా।
తథాఽపి తృష్ణా రఘునందనస్య
వినాశకాలే విపరీత బుద్ధిః॥

బంగారులేడి అనేదిఇతః పూర్వ మెక్కడా లేదు; దాని నెవ్వరూ చూచి యెఱుంగరు; కనీసం దానిని గురించిన వార్త వినా లేదు; ఐనప్పటికీ శ్రీరామచంద్రుడు దాని వెంటబడి వెళ్లాడంటే, అతడికి కష్టకాలం దాపురించబట్టే ఆ విపరీతబుద్ధి పుట్టిందని భావం.

శ్లో॥ యుక్తి యుక్తం వచో గ్రాహ్యం
బాలదపి సుభాషితం।
వచనం తత్తు న గ్రాహ్య
మయుక్తం తు బృహస్పతేః॥

ఒక మాట సహేతుకంగా వున్నట్లయితే, చిన్న పిల్లలు చెప్పినా సరే, దానిని మనం స్వీకరించవలసిందే! అయుక్తంగా వున్నట్లయితే, బృహస్పతి చెప్పినప్పటికీ స్వీకరించకూడదు. ఈ శ్లోకంలోని 'బాలాదపి సుభాషితం' అనే సూక్తిని మనం సందర్భవశాత్తువాడు తుంటాం.

ఎవరైనా ఒక వ్యక్తికి అర్హతకు తగిన ఖ్యాతి లభించక పోయినట్లయితే పుణ్యైర్యశో లభ్యతే' అని చెప్పి ఊరడిస్తాం. మఱొక వ్యక్తికి ఖ్యాతి లభించినట్లయితే, అదే సూక్తిని చెప్పి, ప్రశంసిస్తాం. ఈ సూక్తి లీలాశుకుని శ్రీకృష్ణ కర్ణామృతం లోనిది.

శ్లో. ఉర్వ్యాం కోఽపి మహీధరో లఘుతరో
దోర్భ్యాం ధృతో లీలయా
తేన త్వం దివి భూతలేచ సతతం
గోవర్ధనోద్ధారకః।
త్వాం త్రైలోక్య ధరం వహామి కుచయో
ర్గ్రే న తద్గణ్యతే
కింవా కేశవ భాషణేన బహునా
పుణ్యైర్యశో లభ్యతే॥ 2-105)

'కృష్ణా! లఘుతరమైన గోవర్ధన పర్వతాన్ని ఎత్తినందు వలన నీవు గోవర్ధనోద్ధారకుడనే ఖ్యాతిని పొందావు. త్రిలోక ధారివైన నిన్ను స్తనాగ్రాల మీద భరిస్తున్న నన్ను గురించి యెవ్వరూ పట్టించుకోరు. సుకృతం వలననే గదా కీర్తిలభించేది' అని రాధ కృష్ణునితో అన్నది.

* * *

(తరువాయి 8వ పేజీలో)

# 5. పుష్పవిలాపమొక అపూర్వ కళాఖండము

—డా॥ డి. యస్. వి. సుబ్రహ్మణ్యం, ఎం.ఏ., పిహెచ్.డి.

“The endoment of abstract Qualities, general terms, inamimate objects or other living things, with human attributes, esp. feelings” అను షిప్లే నిర్వచనమును బట్టి Personificate కవితను మానవీకరణ కవిత అనవచ్చును. మానవేతరములందు మానవధర్మము లారోపింపబడుట మానవీకరణము. కరుణశ్రీ పుష్పవిలాపాది ఖండికలను ఇందు చేర్చుట ఉచితము.

కరుణశ్రీ పుష్పవిలాపమొక సుకుమార సుందర భావనా స్వరూపము. మనోజ్ఞ శిల్పము. అపూర్వకళాఖండము. తెలుగునాట ఈ పద్యములు బహుళ ప్రచారములు పొందినవి. ఈ కావ్యఖండికపై ఖండనమండనములు బహుళముగ ఆవిర్భవించినవి. పూలపై కరుణశ్రీ భావములను కొందరు దూషింపగ ఎందరో భూషించిరి. పుష్పవిలాపముపై దుమారము చెలరేగినది. ఇది పూల దుమారము గనుక సహృదయులకు అఘ్రాణ యోగ్యమే అయినది. ఈ ఖండికలోని కవి హృదయమును సహృదయతతో పరికింపవలసి యున్నది.

“పుష్పవిలాపము” ద్వారా కవి దీన, హీన, మ్లాన జీవితములతో చెలగాటము లాడ వద్దని పుష్ప వ్యపదేశముతో ఉపదేశించినారు. మా యౌవ్వన మెల్లకొల్లగొని ఆపై చీపురుతోడ చిమ్మి మమ్ము ఆవల పారబోయవద్దని పూలకంఠాలలో మానవ కంఠమును మారు మ్రోగించినారు. ఆవశ్యకమైనంత వరకు మా రెక్కల కష్టమునందుకొని అనుభవించి ఆనందించి వాడిపత్తలై రెక్కలు జారిపోవగనే పరిహరింతురు మమ్ము పెంటదిబ్బలపై అని కష్టజీవుల కరుణ స్వరమును విరుల గొంతుకలో వినిపింప జేసినారు. పరమసుకుమారములగు విరులు మానవ హృదయములకు ప్రతీకలు. అవి భగవంతుని అస్తిత్వమునకు ప్రతిబింబములు. అవి కరుణామయుడగు భగవంతుని కరుణా మరంద బిందువులను చిందించు ప్రకృతి బాలలు. అటువంటి సుకుమార సుందర సురభిళ సుమపుంజములను నిర్దాక్షిణ్యముగ త్రుంచుట, చీల్చుట, త్రొక్కుట రెక్కలు విరుగునట్లు నలిపివేయుట గుండెలలో సూదులు గ్రుచ్చి వేధించుట, బాధించుట, కోమల హృదయుడగు కవి గుండెను కదలించినవి. లతామతల్లుల నుండి పూలను గిల్లుట తల్లిబిడ్డలను వేరు చేయుటయే అని కవిభావన. ఇందు స్వార్థమున్నదని కరుణశ్రీ భావము. కనుకనే “అమ్మకొందువె మోక్ష విత్తమ్ము కొఱకు”? హృదయమే లేని నీ పూజ లెందుకను పూల ఆక్రందనమును కరుణశ్రీ ఆలకించగలిగిరి.

ఇంతటి సున్నితములగు భావములను వ్యక్తము చేయవలెనని కవి మానసిక సంఘర్షణకు గురికావలయును. కవిహృదయమును కదలించెడి సంఘటనలచే సన్నివేశములచేగాని ఉత్తేజితుడై విపరీతమగు మానసిక సంక్షోభకు గురియై ప్రసవవేదన ననుభవించి గుండెలలోని బాధను మాటల రూపమున వాహింప జేయును. అంతర్మథన ప్రళయ సముద్రోద్భూతమైన కవిత నిర్దుష్టమై కడిగిన ముత్యమువలె ప్రకాశించి పదుగుర హృదయముల స్థానము నాక్రమించును. ఒకే విషయమునకు సంబద్ధములైన సంఘటన లనేకము ఆ దృష్టిగలవాని హృదయము నాకర్షించి మానసిక సంక్షోభ కారకములగును. కరుణశ్రీ పుష్ప విలాపము ఇట్టి సున్నిత సన్నివేశములకు రూపుదాల్చిన ఆకృతి.

పూలను మాడ్చిదాదు తయారు చేయుట, సన్మానములలో సభలలో పూలను చిదిమి రేకలు చల్లుట, మార్గమున దట్టముగ పఱచుట వాటిని పాదాలతో త్రొక్కుటవంటి సన్నివేశములు కరుణశ్రీ గుండెలలో విపరీతమగు బాధను కలిగింప జేసినవి. ఇంకనూ ఇటువంటి సంఘటనలచే ప్రభావితులైన శాస్త్రి గారి మనసు తీవ్ర సంక్షోభమునకు గురియై పుష్పవిలాపరచనకు దారి తీసినది.

ఆదికవి వాల్మీకియు ఇటువంటి సన్నివేశముచే ప్రేరేపితుడై శోకోద్దీపిత మనస్కుడయి ప్రథమ శ్లోకము సృజించినాడు కదా! ఇటువంటి సన్నివేశములు వారి వారి మానసిక చిత్తవృత్తికి అనుగుణముగ తమ ప్రభావమును జూపుచుండును. ఉదాహరణకు గాలిలో తేలియాడు మబ్బులను పదిమంది చూచినచో వారి వారి మానసిక స్థితిగతుల కనుగుణముగ ఆ మబ్బులలో ఆకృతులు చూడగలరు. పుష్పముల జీవిత గాథజూచిన కరుణశ్రీ మృదు హృదయమున కనుగుణముగ పుష్పవిలాప ముదయించ మరొకరి మానసిక స్థితిగతుల కనుగుణముగ పుష్పప్రమోదము, వివేకము కలుగవచ్చును.

పుష్పవిలాపఛాయలలో ఈకవితకు పూర్వము ఇటువంటి భావములను కవులు వెల్లడి చేయకపోలేదు.

---

(7వ పేజీ తరువాయి)

విజ్ఞాన ఖనులైన పండితులతో మాట్లాడేటప్పుడు వారిటువంటి ప్రాస్తావిక సూక్తులను పుంఖానుపుంఖాలుగా చెబుతుంటారు. వాటి నన్నింటిని సేకరించి, తర్వాతి తరంవారి కందజేయు వలసిన ఆవశ్యకత, బాధ్యత సాహిత్యాభిమానుల పట్ల ఎంతైనా వున్నది.

—0—

'నళిలు నళిలు బాణః సన్నిపాత్యోఽయ
మస్మిన్
మృదుని మృగశరీరే పుష్పరాశావివాగ్నిః'

పుష్పరాశియందు అగ్నివలె మృదువైన ఈ మృగముశరీరమున బాణము వేయవలదని శాకుంతలంలో ఆశ్రమవాసులగు వైఖానసులు అనినట్లుగ కాళిదాసు ప్రయోగించిరి. '20 వ శతాబ్ద ప్రారంభములో పత్రికలలో కొన్ని ఖండకావ్యములు ప్రచురించబడుచుండెడివి. ఆరోజుల్లో వేంకట పార్వతీశ్వరకవులు చాతకము చంద్రకాంతపుష్పము, సూర్యకాంతపుష్పము మొదలగు ఖండకావ్యములు ప్రకటించిరి. సూర్యకాంతపుష్పము సూర్యోదయముతో వికసించి, తలయెత్తి ప్రొద్దు గ్రుంకినంతనే ముకుళించుకొని పోవును. సూర్యాస్తమయమయినంతనే పూవు విలపించుచున్నది. దానికి దుఃఖము భరించు శక్తి లేకపోయినదని భావించి ఓదార్చుట ఈకావ్యమునందు కానవచ్చుచున్నది.'1 అను సారస్వత వ్యాసనంపుటి లోని 'మీనాబాయి'గారి వచనముల బట్టి కరుణశ్రీ పుష్పవిలాపమునకు పూర్వము తెనుగున పుష్పవిలాపమేగాక పుష్పసాంత్వనము గూడ కలదని తెలియుచున్నది. ఇటువంటి భావములనే పుష్పవిలాపముద్వారా కరుణశ్రీ వ్యక్తపరిచిరి. బహుళప్రచారము పొందిన ఈ కావ్యఖండిక చలువగల వెన్నెలకు సౌరభమబ్బినట్లుగ కరుణశ్రీ కమనీయ కవితాశిల్పము ఘంటసాలగాన మాధుర్యముతో విశేషముగ ప్రజాసన్నిహితమైనది.

ఇందు ప్రధానాంశము 'పుష్పములు కవితో తమ గుండెలోని బాధలు మొరపెట్టుకొనుట' ఈ పుష్పములు లోకములోని అభాగ్య మానవకోటికి ప్రతీకలు. పూలు చిదుమువారలు ధనికవర్గపు పావుటాలు అని ధ్వనితము. పూల మొరనాలకించిన కవి పూలను చిదమజాలక రిక్తహస్తములతో దేవరకెరుక చేయుటకు దేవళమునకు అరిగినాడు.

ఆస్తికుడయిన కవి గంగాస్నానాదులు ముగించుకొని దైవమును అర్చించుటకు పూలవనికి వెళ్ళినారు. వెళ్ళి

'నేనొక పూలమొక్కకడ నిల్చి చివాలున
కొమ్మవంచి గో
రానెడు నంతలోన విరులన్నియు జాలిగ
నోళ్ళువిప్పి 'మా
ప్రాణము తీతువా' యనుచు బావురమన్నవి.
క్రుంగిపోతి. నా
మానసమందెదో తళుకుమన్నది పుష్పవిలాప
కావ్యమై'

'ఇది కరుణశ్రీ హృదయోత్పలమునుండి వెల్లుబికి వెల్లువలై ప్రవహించినతేనెవాక' 2 అంటారుసీరపాణి.

పూవును చిదుముటకు గోరానునంతలో విరులన్నియు జాలిగ నోళ్ళువిప్పి బావురుమన్నవి. నిశితముగ పరిశీలించిన విరుల ఆక్రందనములలో ఎందరో అభాగ్యపు అబలలవిలాపము, కష్టజీవుల దుర్భర దీనాలాపము వినిపించును.

ఆ విరులు సున్నితముగ మందలించుచున్నవి. మమ్ములను మోక్షవిత్తమ్ము కొఱకు అమ్మకొనుచుంటివి. హృదయము లేని నీ పూజలెందుకని ప్రశ్నించుచున్నవి. అంతియగాక నీమది బండబారినదా? శివుని పూజకు చిన్నపూలు పూయజాలదా అని గద్దించుచున్నవి, మేము బ్రతికిన నాల్గుగడియలు స్వేచ్ఛగ బ్రతుకుచు-

'గాలిని గౌరవింతుము సుగంధముపూని:
సమాశ్రయించు భృం
గాలకు విందుచేసెదము కమ్మనితేనెలు:
మిమ్ముబోంట్ల నే
త్రాలకు హాయిగూర్తుము, స్వతంత్రుల
మమ్ముల స్వార్థబుద్ధితో
తాళుము త్రుంపబోకుము: తల్లికి బిడ్డను
వేఱుసేతువే'

గాలిని గౌరవించి, భృంగాలకు విందుచేసి మానవుల నేత్రాలకు హాయిగూర్చు పూవాలను, స్వార్థబుద్ధితో త్రుంపకుము తల్లిని బిడ్డను వేరుచేయవద్దని పలికినవి.

'దీనుల దారాలతో గొంతు కురిబిగించి
గుండెలోనుండి సూదులు గ్రుచ్చి కూర్చి
ముడుచుకొందు: ముచ్చట ముడులమమ్ము
అకట దయలేని వారు మీ యాడువారు.'

ఉరిబిగించుట గుండెలో సూదులుగ్రుచ్చుట నిర్దయకు చిహ్నముగ కనిపించుచున్నవి. ఈపద్యము సంఘమున విశేష ప్రచారము పొంది ఎంతో ప్రభావము చూపినది. ఎందరో పూలను తలలో అలంకరించుకొనుట మానుటయు జరిగినదనుట సత్యము.

'అక్కట హాయిమేయు మహిషాసురు లెం
దరొ నాల్గుప్రక్కలన్
ప్రక్కలమీద చల్లుకొని మాపని మేనులు
పాదుకాళ్ళతో
త్రొక్కుచు దొర్లి-దొర్లి మఱిరోజుదయాననే
వాడిపత్తరై
రెక్కలు జారిపోవ పరిహరింతురు మమ్ముల
కంటదిబ్బపై'

మహిషాసురులతో పోల్చబడిన సుఖలాలసగలవారు 'హాయిమేయుట' సముచిత ప్రయోగము. 'వాడిపత్తరై రెక్కలు జారిపోవ పరిహరింతురు' అను పదములోని వాచ్యార్థముతో దాటుగ వ్యంగ్యార్థమును గ్రహింపవలయును. ఇచ్చట పుష్పములు రెక్కల కష్టము పైననే ఆధారపడియున్న కష్టజీవులకు ప్రతీకలు. మాయామర్మము లెరుగని ఆ కష్టజీవులలోని మానవత్వమే ఇచట మృదువైన పుష్పము. ఇందు శరీరములో శక్తియున్నంతవరకు పనులుచేయించుకొని శక్తి సన్నగిల్లిన త్యజించుట ధనిక వర్గపు స్వభావమును తెలియజేయుచున్నది.

---

1. సాహితీ మంజూష - తెలుగులో కొన్ని ఖండకావ్యములు పుట-320
2. ప్రజారథం మాసపత్రిక - 22-5-70 పుట 17.

'మావెలలేని ముగ్ధసుకుమార సుగంధ
మరంద మాధురీ
జీవితమెల్ల మీకయి త్యజించి కృశించి
నశించిపోయె, మా
యౌవనమెల్ల కొల్లగొని ఆ పయి చీపురు
తోడ చిమ్మి మ
మ్మావల పారబోతురుగదా! నరజాతికి
నీతియున్నదా!'

స్త్రీలను పూలతో పోలిచి పూబోడి ఇత్యాదిగ ప్రయోగించుట అనూచానముగ వచ్చుచున్న సంప్రదాయము. వెలలేని ముగ్ధ సుకుమార సుగంధ మరంద మాధురీ జీవితమెల్ల మానవుల కొఱకు త్యజించి కృశించిన పూలలో అభాగినులయిన పూబోడులు ప్రతిబింబించుచుండిరి. వాడిన పూలను చీపురుతో చిమ్మి ఆవలపారవోసినటుల స్త్రీ జాతిని అభాగినులను జేసిన నరజాతికినీతి యున్నదా! అని పూలగొంతులలో అబలల ఆక్రోశము ప్రతిధ్వనించుచున్నది. బుద్ధుడు జన్మించినంతటి గొప్పభూమి యందు పుట్టితివి, అయినను అచ్చస్వచ్ఛమయిన ప్రేమ చచ్చిపోయినది. పూజలేకున్న చాలును మా కుత్తుకలను కోయకుము. మమ్ము హత్యచేసి నీవు బావుకొనునదేమి! ఇట్లు పుష్పములు చీవాట్లు పెట్టగ, భగవంతునకు విన్నవించుకొనుటకు వచ్చితినని ముగింపు.

పరమసుకుమారమైన సుందర సన్నివేశమును ఇంతరమ్యముగ చిత్రించిన ఈ ఖండికను గూర్చి 'జీవతత్త్వద్యోతనానికై ఆరోపించిన మనుజత్వంవల్ల ఎన్నో అనర్థోపదేశాలు తటస్థపడుతున్నాయి'3 అని శ్రీ జమదగ్ని అభిప్రాయపడినారు. వీరి అభిప్రాయమును ఖండించుచూ' అత్యంత సుందరమైన శిల్పంతో జాతీయము, మకరంద సదృశము నైన తేటతెనుగు నుడికారంతో కరుణరస భరితమై మానవసమాజాన్ని ఒకమెట్టుపైకి తీసుకుని పోగల్గిన ఆధునిక మహాకావ్యం, 'పుష్ప విలాపాన్ని' శ్రీ జమదగ్ని గారు అమంగళాపాది అనడం సమర్థనీయం కాదు'4 అని కె. వి. రామారావుగారిజవాబు. ఇత్యాదిగ పూలదుమారము నేటికిని రేగుచునే యున్నది. పుష్పవిలాపమునకు అనుసరణకావ్యములుగ పుష్పప్రమోదము, పుష్పవివేకము, కుక్కుట విలాపమువంటి ఎన్నియో విలాపకావ్యములు వెలువడినవి.

కరుణశ్రీ కావ్యములను విమర్శించువారిని గూర్చి చర్చించుచు 'పుష్పవిలాపాదులు హిందీసాహిత్యములోని భావములకు విపరీకరణలే యని వీరివాదము. వాస్తవమే కావచ్చు'5 అని గొల్లపూడి ప్రకాశరావుగారు ఒకపాలు అంగీకరించినట్లుగ మొగ్గు జూపిరి. పుష్పవిలాపమునకు మాత్రము హిందీ మూలమున్నటుల కనిపించదు.

ఈరీతిగ పుష్పవిలాప ఖండకావ్యమును నిష్పాక్షిక దృష్టితో పరిశీలించినచో సహృదయ పాఠకునకు అది ఒక 'అపూర్వ కళాఖండముగ: సాక్షాత్కరించును.

3. సమాలోచన_16_12_77
4. సమాలోచన_తేది 16_2_78
5. కరుణశ్రీ కవితాశ్రీ - పుట 86.

(000)

# 6. ఆంధ్ర నాటక కర్తగా కొప్పరపు సుబ్బారావుగారు

—శ్రీ మంతెన సూర్యనారాయణరాజు

"కావ్యేషు నాటకమ్ రమ్యమ్" "నాటకాంతమ్ హిసాహిత్యమ్" అంటూ సంస్కృత లాక్షణికులు సాహిత్య ప్రక్రియలన్నింటిలో నాటకానికి పెద్ద పీట వేసారు. అటువంటి నాటకరంగ నిర్మాతగా, రచయితగా, ప్రయోక్తగా, లిటిల్‌థియేటర్‌కి నాయకుడుగా, నాట్యాచార్యుడుగా కొప్పరపు సుబ్బారావుగారు ఆంధ్ర నాటకరంగానికి చేసిన మేలు ఇంతింతని చెప్పలేము. సేవలు కొనియాడలేము. వారి నామము చిరస్మరణీయము.

కేవలము నాటక కర్తగా సుబ్బారావుగారు పలు పసందైన నాటకాలను ఆంధ్ర నాటకరంగానికి అందించినారు. వాటిలో ఘోషనార, మూర్జహాన్, వసంతసేన, తారాశశాంకం, శ్రీ సామ్రాజ్యం (అముద్రిత నాటకం), రాణాప్రతాప్ (అముద్రిత నాటకం), ఇనపతెరలు (అముద్రిత నాటకం) మొదలైన నాటకాలు పేరెన్నికగన్నవి. పోతే వీరియొక్క నాటికల్లో ఆణిముత్యాలు అల్లిముఠా, చేసినపాపం, నేటినటుడు - మొదలుగాగలవి దృశ్యకావ్యాలైతే రేడియోకి, సంబంధించినవి కొన్ని శ్రవ్యకావ్యాలుగా భాసిల్లాయి. సుబ్బారావుగారు ఇంకా పలు ప్రక్రియలలో నిష్ణాతులనడానికి శాస్త్ర దాస్యం (విమర్శ), తెలుగుదేశం (కావ్యం), ఆంధ్ర నాటకరంగ ప్రవేశిక (చరిత్ర), ఎరుకుల లక్ష్మి (గేయాలు) లాంటివెన్నో రచన గావించారు. ముందు ఉటంకించిన మూడూ అముద్రితాలని గ్రహించాలె.

కొప్పరపు సుబ్బారావు గుంటూరుజిల్లాలోగల అన్నవరములో 1898 సంవత్సరము ఏప్రియల్‌నెల 29 వ జన్మించారు. వారితల్లిదండ్రులు రామమ్మ, కామయ్యగారలు. పువ్వు పుట్టగానే పరిమళిస్తుందన్నట్లు వీరు బాల్యం నుంచీ రూపక కళపట్లఆసక్తి కలిగినటువంటివారు. తోలు బొమ్మలాటలు, వీధి నాటకాలు వగైరాలు చిన్నతనంలో అదే పనిగా చూస్తూవుండేవారు. ఈనాటివారు ఇటువంటి ముచ్చటలు వింటే నవ్విపోగలరు కూడా. కారణం ఇది సినిమాలయుగం కాబట్టి. కానీ నిజానికి అనాటి వినోదాలు మేల్బంతులైనవని విజ్ఞులు విశ్వసిస్తారు.

బాపట్ల, విజయవాడ, రాజమండ్రి పట్టణాలలో వీరిచదువు కొనసాగడం మూలంగా అడవి బాపిరాజు లాంటి పెద్దలతో మైత్రి

కలిగే భాగ్యం లభించింది. సుబ్బారావుగారు బాపిరాజుగారితో కలిసి ఆశుకవిత్వం కూడా చెప్పడం జరిగిందని సమకాలికుల ఉవాచ. స్కూల్ ఫైనల్ చదువుతో చదువంటే ముఖం మొత్తేసింది. సుబ్బారావుగారికి అంతే అనాటి మంచి నాటక కళపట్ల ఆసక్తి హెచ్చునారంభించిందన్న మాట.

ఒక విధంగా చెప్పాలంటే నాటక కళాంబుధిని ఔపోసన పట్టిన కళాతపస్వి. బహుముఖ ప్రజ్ఞా శాలి కొప్పరపు సుబ్బారావుగారు నాటకప్రదర్శనకు అనుగుణంగా తెరకట్టడం దగ్గర్నుంచి ఆయా అంతర్భాగా లన్నింటినీ పొందికగా ఏది ఎలా గుదిగూర్చాలో ఆయనకు తెలిసినంతగా ఎవరికీ తెలియదు. తన నాటకాలద్వారా తెలుగు ప్రేక్షకలోకాన్ని రసజగత్తులో ఓలలాడించిన ఉత్తమ నాటక కర్త, ప్రయోక్త వారు. ఇంకా చెప్పాలంటే ఎందరో ఔత్సాహిక కళాకారులను మహానటులుగా తీర్చిదిద్దినదివారు. శివసాయుజ్యం పొందేవరకూ తెలుగు నాటకరంగానికి ఆయన అంకితస్వభావంతో కృషి చేసిన మహోన్నత వ్యక్తి అంటే అది అతిశయోక్తి మాత్రం కాదు.

సుబ్బారావుగారి నాటకాల్లో ఆయనను నాటక కర్తగా హిమవత్ పర్వతమంత ఎత్తుకు తీసికెళ్ళింది. "రోషనార" తారాశశాంకం కూడా ఉన్నత ప్రమాణాలతో వ్రాయబడినటువంటి నాటకమే! నాటికల విషయానికొస్తే ‘‘అల్లి ముటా!’’ కూడా ఉదాత్తమైనట్టి రచన. పూర్తిగా జాతీయమైన భావాల ప్రేరణవల్ల 1920 ప్రాంతంలో రచించిన గద్య పద్య గేయాలలో వ్రాయబడిన చారిత్రాత్మకనాటకం రోషనార, మీదు మిక్కిలి ఒడలు పులకరింపచేసే కథ. నెత్తురు మరిగింప జేసే దేశభక్తి వగైరాలతో ఆనాటకం తెలుగు జాతిని ఒక్క కుదుపు కుదిపిందని చెప్పుకో వచ్చు. ఇది 1921 వ సంవత్సరంలో తొలి సారి అచ్చొత్తించ బడింది. మొదటిసారిగా రచయితే దానికి దర్శకత్వం చేపట్టడం జరిగింది. ఆనాటినుండీ సుబ్బారావుగారి పేరు ‘రోషనార సుబ్బారావుగారు’గా ఆయన పేరు దశ దిశలా మార్మ్రోగిపోయింది. ఆనాటకం ఆనాటి బ్రిటిష్ ప్రభుత్వాన్ని గజగజ లాడించి వణుకుపుట్టేలా చేసింది. అందుకే ఆ ఆంగ్ల ప్రభుత్వంచేత నిషేధింపబడింది.

నాటకపరంగా పాత్రల సృష్టి గురించి చెప్పాల్సొస్తే రోషనార పాత్ర అత్యద్భుత సృష్టి. అదే విధంగా రజాక్, దావూద్- పాత్రలు కూడా సుబ్బారావుగారి అపురూప రూపకల్పనయే! అటు శృంగారరసం, ఇటు హాస్యం రెండు సమపాళ్ళలో చిప్పిల్లుతూ ఆ నాటకం ఎంతో పేరు ప్రఖ్యాతులు సంపాదించి పెట్టింది. శివాజీపాత్ర ద్వారా చెప్పించిన పద్యాలు వీర రసంతో కదం తొక్కుతాయి. ఈ నాటకం ద్వారా మహానటుడు కీ॥ శే॥ పద్మశ్రీ స్థానం నరసింహారావు గారికి అఖండ కీర్తి వచ్చింది.

వీరి మరో అద్భుతసృష్టి ‘తారాశశాంకం’ నాటకం. దీనిని ప్రబంధ పరంగా హీన యుగానికి చెందినదని విమర్శకులు దూరంగా వెలి వేయడం జరిగింది. అదీగాక బూతు పురాణం అని, రంకు పురాణం అని - ఎన్నో అపప్రథలు జన వ్యవహారంలో వున్నా సుబ్బారావుగారి చేతిలో నాటకంగా మారి నూతన వ్యాఖ్యానాదులతో చక్కని చిక్కని మధురమైన పద్యాలతో క్రొత్త కీర్తి సంతరించుకోగలిగిందంటే నిజంగా గొప్ప విషయమే నని ప్రతీ ఒక్కరూ అంగీకరించక తప్పదు. ప్రబంధంగా వ్రాసి శేషం వెంకటపతి చేసుకున్న పాపమేమిటో, కొప్పరపు సుబ్బారావుగారు నాటకంగా వ్రాసి చేసుకున్న పుణ్యమేమిటో కాలమే నిర్ణయించగల గాలి మరి. ఈ నాటకాన్ని ఆంధ్రదేశంలో పలు మూలలా ప్రదర్శించి రక్తికట్టించింది శ్రీరాజ రాజేశ్వరీ నాట్యమండలివారు. ముఖ్యంగా పువ్వుల సూరిబాబుగారు, రాజేశ్వరి గారు, మాష్టర్ భీమారావ్ వగైరాలు అప్పట్లో దీనిని సినిమాటెక్నిక్స్‌తో కడు చక్కగా ఊరూరా ప్రదర్శించేవారు.

ఇంచుమించు వెయ్యి ప్రదర్శనలు యిచ్చినట్లుగా శ్రీనివాస చక్రవర్తిగారి కామెంట్, అది సత్యదూరమైన విషయం మాత్రం కాదు. మొత్తానికి ఈ ‘తారాశశాంకం’ నాటకంలో ఒక ఆకర్షణ వుందనడానికి ఈ వ్యాసరచయితే ఒక పర్యాయం స్వగ్రామమైన ఓ పల్లెటూళ్ళో టిక్కెట్టు కొని కిక్కిరిసిన ప్రేక్షకుల మధ్య ప్రేక్షకుడుగా చూడ్డం సంభవించింది గనుక, ఇందులో బృహస్పతి. చంద్రుడు, తార, లంబు, జంబు వగైరా పాత్రలున్నాయి. మిగిలిన పాత్రలంత ప్రాధాన్యమైనవికాదు. పోతేనాటకంలో ప్రధాన పాత్రలు కాకపోయినా ఔచిత్యం కోసం సున్నితమైన హాస్యం అందించాలనే ఉద్దేశం లంబూ, జంబూ పాత్రలద్వారా మనకు గోచరిస్తుంది. చురుకైన సంభాషణలు, క్లిష్టమైన సన్నివేశములతో ఈ నాటకం పదిమందినీ ఆకట్టుకునేదిగా సుబ్బారావుగారి లేఖిని నుండి రూపు దిద్దుకుంది.

‘ఇనుపతెరలు’ నాటకం గురించి ప్రస్తావించదలిస్తే అవిఅచ్చుకు నోచుకోకపోవడం ఆంధ్ర ఔత్సాహిక కళాకారుల దురదృష్టమని చెప్పుకోవాలి. వీరు తయారు చేసినటువంటి ప్రయోగ పతన ప్రతిష్ఠనీ ‘స్లావస్కీ ఒథెల్లో’, సెగల్ - నాటకాలకు ఎట్టి పరిస్థితుల్లోనూ తీసిపోదు. ఇంకా చెప్పుకుంటూపోతే నూర్జహాన్, వసంతసేనలతోబాటు అముద్రిత నాటకాలైన స్త్రీ సామ్రాజ్యం, రాణాప్రతాప్‌లు ఆయన ఆంధ్ర నాటక కర్తగా ఎంతగానో ఉన్నతశిఖరాలకు అధిరోహించే టట్లుగా చేసాయి.

‘అల్లి ముటా’ ఇది ఆంధ్ర ప్రేక్షక లోకంలో ఆరోజులలో ఎక్కువ ప్రజాదరణ పొందిన మొట్ట మొదటి గేయాలతో కూడిన నాటిక, ‘గిల్బర్ట్ సల్లివాన్’ ఆంగ్లంలో రచించిన సంగీత నాటిక “పైరేట్స్ ఆఫ్

వెంజన్స్'' ప్రేరణవలన వచ్చింది. అవినీతిని ఖండిస్తూ, వెక్కిరిస్తూ వెలువడింది. ఇది దాదాపు వేయి పర్యాయములు ప్రదర్శించబడి నట్లు చెబుతున్నారు. నాటికీ నేటికీ ఆ నాటిక ఆ పాతరోజుల్లోగల ఆకర్షణను ఇంకా కోల్పో లేదంటే నిజంగా అది ఎంత ఉదాత్తమైన రచనో, నాటికలపట్ల సంపూర్ణ అవగాహన వున్న ఏ వ్యక్తైనా చెబుతారు. అవ ప్రజల్లో ఒక మార్పు కూడా తెచ్చి పెట్టేదిగా వుందని అనిపిస్తుంది.

ముఖ్యంగా తెలుగు నాటకాన్నిగాని, నాటికనుగాని ఎలా ప్రయోగిస్తే ప్రేక్షకులుబాగా చూస్తారు, ఆదరిస్తారు, ఆర్ద్ర హృదయులౌతారు – అన్న దానిని గురించేవారు ఆలోచించే వారని అనిపిస్తూ వుంటుంది. ఆయన రచనా సరళిని బట్టి ఆలోచిస్తే: అందుకే ఆయన ఏది చేయతలపెట్టినా ప్రతీ దాన్లో ఒక చక్కని పంథా (ఒరవడి) వున్నట్లుగా గోచరిస్తుంది. బతికినన్నాళ్లూ కొప్పరపు సుబ్బారావుగారి యొక్క గృహం ఒక కళాకేంద్రంగా భాసిల్లినట్లు సమకాలికులు చెబుతుంటారు. ఆ కేంద్రానికి ఆయనే ఆచార్యుడు. ఆ ఆచార్యత్వం ఆంధ్ర నాటకరంగానికే పెద్ద పీఠం వేసిందని చెప్పవచ్చును. అటువంటి మహామహుని పేర ఆంధ్ర దేశమంతటా నాటకకళాపీఠాలు ఏర్పాటు చేయాలని, వారి గ్రంథాలపై సమగ్ర పరిశోధన సాగించాలని ఆవిషయంలో ప్రభుత్వం ఒక గురుతర బాధ్యత చేపట్టాలని ఆశిద్దాం.

( *** )

# 7. గురజాడవారి "డిసెంటు పత్రం"లో కొన్ని మచ్చుతునకలు

—శ్రీ క్రొవ్విడి రామం, బి.ఏ.,బి.యల్., బి.యిడి.,

విద్యార్థుల వ్యాసరచనకు అనుగుణమైన భాషను నిర్ణయించే నిమిత్తం, మద్రాసు విశ్వవిద్యాలయంవారు 1914 వ సంవత్సరంలో తెలుగు కాంపోజిషన్ సబ్ కమిటీని నియమించేరు. వేదం వేంకటరాయ శాస్త్రిగారు, కొమర్రాజు లక్ష్మణరావుగారు ప్రొఫెసర్ రంగాచార్యులుగారు, జయంతి రామయ్య పంతులుగారు జి. వేంకటరంగారావుగారు, గురజాడ అప్పారావుగారు యీ కమిటీలో సభ్యులు. ఈ కమిటీలోగల మెజారిటీ సభ్యుల అభిప్రాయంతో అప్పారావుగారు ఏకీభవించలేక పోయినారు. తత్ఫలితంగా యీ డిసెంటు పత్రం ఆంగ్లంలో ఆవిర్భవించింది. ఈ పత్రాన్ని అప్పారావుగారు, 'ఓ.డిపోయిన వాడి మొట్టు'గా పరిగణించేవారని, పజ్ఝలవారు చెబుతూవుండేవారు. ఆంగ్లంలో రూపొందిన యీరచనను, పోరంకి దక్షిణామూర్తి గారు ఆంధ్రంలోకి అనువదించేరు. ఆంధ్ర దేశంలో వివిధ ప్రాంతాలలో గలవారికి ఉపయోగకరంగావుండే శిష్టవ్యావహారిక భాషకు సంబంధించిన పరిశోధనాత్మకమైన రచనయిది. వచన నాటక రచనలోను. కవితలోను, కొత్త పుంతలు తొక్కిన వీరికలం. యీ రచనలో, భాషాశాస్త్రంలో వీరికిగలకూలంకష మైన పరిజ్ఞానాన్ని తెలియజేస్తుంది. ఈ మహామనీషి అంతిమ యాత్రకు ఒక సంవత్సరం ముందుగా 1914 లో యీ డిసెంటు పత్రం వెలువడింది.

వ్యావహారిక భాషకు ప్రామాణిక స్వరూపాన్ని నిర్దేశించడం యీ కమిటీ ప్రధానకర్తవ్యం. అని సిండికేట్ నిర్వచించింది. కమిటీ సభ్యులు యెన్నో సమావేశాలు జరిపి, తీర్మానాలు చేసేరు. ప్రాచీనకావ్యాలలోగల కొన్ని గ్రామ్య పదాలను అనింద్యగ్రామ్యాలుగా పరిగణించి, వాటిని గ్రాంథికవాదులు అంగీకరించేరు. అవితప్ప మరి యే యితరములైన గ్రామ్యపదాలకు భాషలో చోటు వుండకూడదని యీ కమిటీ మెజారిటీ సభ్యుల అభిప్రాయం. 'వాడేనా' అని ప్రయోగించే అవధారణార్థంలో. 'ఏ' వర్ణం వెంబడే, నిర్దిష్టవాచకమైన 'ను' వర్ణంవస్తున్నది. ఉదాహరణకు, 'వాడేను' అనేపదం తీసుకుందాం. సంప్రదాయక వ్యాకర్తలు, 'ను'వర్ణాగమాన్ని గుర్తించలేదు. 'వాడేనా' 'వీడేనా' అన్న రూపాలకు మారుగా 'వాడేయా' 'వీడేయా' అన్న గ్రాంధిక రూపాయలను ప్రయోగిస్తారని వ్రాసేరు. (చూడు పేజీ 14) 'వాడేయా' 'వీడేయా' అనేపదాలు గ్రాంధిక భాషలో యెక్కడైనా వున్నాయా? అనే సందేహం కలుగుచున్నది. కొమర్రాజు లక్ష్మణరావుగారు రెండు వందలకుపైగా వున్న పదముల పట్టికను తయారుచేసి, అవిసార్వజనీన వ్యవహారంలో వున్నాయని అంగీకరించేరు. ఆ పట్టికలో 'ఎనిమిది మంది' 'తొమ్మిదిమంది' 'తొమ్మండుగురు' 'తోవ' అనే అగ్రాంధిక రూపాల్నికూడా చేర్చేరు. కడప, కర్నూలు, అనంతపురం, బళ్ళారి జిల్లాలలో, మాండలిక శబ్దవిభేదాలను గుర్తించి పరిశీలించిన ప్రముఖభాషావేత్త ఆర్డెన్, 'స్త్రీలింగ పుల్లింగాలలో సంఖ్యావాచకాలను చెప్పినప్పుడు వచ్చేరూపాలు, నపుంసకంలో వచ్చేవాటికి విరుద్ధంగా వుంటాయి. కాని మామూలు సంభాషణలో తొమ్మిదికి సంబంధించినంతవరకూ మాత్రం యీ రూపాలనే ప్రయోగిస్తున్నారు. అంటే తొమ్మిది తరువాత స్త్రీలింగ పుల్లింగరూపాలలో మాదిరిగా "మంది" అనేపదం చేర్చడం జరుగుతుంది. కాని కోస్తాజిల్లాలలో 'ఎనిమిది మంది', 'తొమ్మిది మంది' అనేరూపాలు

వాడుకలో లేవని వీరు స్పష్టంగా చెప్పేరు.

'చేస్తున్నాడు' 'వస్తున్నాడు' మొదలైన క్రియలలో గల 'స్తు' ను గురించి అప్పారావుగారు తీవ్రమైన పరిశోధన చేసేరు. 'వస్తాడు' మొదలైన రూపాలు నిత్యవ్యవహారంలోను, శాసనాలలోను, ప్రాచీనకథలు, చరిత్రలు, వ్యాఖ్యలు, యితర సాహిత్యప్రక్రియలు, మొదలైన వాటిలో అసంఖ్యాకాలుగా కనపడుతున్నా గ్రాంథిక వాదులు యీ రూపాన్ని తోసిపుచ్చేరు. ఇది చాలా శోచనీయమని అప్పారావుగారు పేర్కొన్నారు.

కాశీమజిలీ కథల వంటి కథలలోను, పిల్లల కథలలోను, మెకంజీ కైఫీయతుల్లోను, 'బొబ్బిలియుద్ధం' వంటి పల్లెపదాలలోను, చరిత్రలలోను, న్యాయస్థానాలలో దాఖలైన పత్రాలలోను. మతగ్రంథాలలోను, శాసనాలలోను, స్త్రీలపాటలలోను 'స్తా' తో కూడిన రూపాలు ఆంధ్రదేశమంతటా సర్వత్రా ప్రజలు ఉపయోగిస్తున్నారని 'రిపోర్టు' లో సోదాహరణంగా అప్పారావుగారు వివరించేరు. విశాఖపట్నం, గోదావరి, నెల్లూరు. కృష్ణా జిల్లాలలోగల ప్రాచీన శాసనాలన్నిటిలోను యీ "స్తి" రూపం కనపడుతుంది. కృష్ణాజిల్లాలోగల శిఖామణంలో 1440 లో కృష్ణదేవరాయలు వేయించిన శాసనంలో "సమర్పిస్తిమి" అనే రూపం వుంది. నేడు విజయనగరం విశాఖపట్నం జిల్లాలలో గల స్త్రీలు వాయనం ఇచ్చేటప్పుడు "ఇస్తినమ్మ వాయనం, పుచ్చుకుంటినమ్మ వాయనం" అని చెబుతారు. 'ఇస్తిని'లాగే 'యిస్తాడు' 'వస్తాడు', 'చేస్తాడు', 'పోస్తాడు' వంటి రూపాలు నిత్యవ్యవహారంలోను, ప్రాచీన లిఖిత సంపుటాలలోను వున్నా, గ్రాంథిక వాదులు యీరూపాన్ని బహిష్కరించేరు.

చిత్రం ఏమిటంటే రంగరాట్ ఛందము, రాఘవ పాండవీయ వ్యాఖ్య మొదలైన ప్రాచీన అముద్రిత గ్రంథాలలో గల యీ "స్తి" రూపాన్ని గ్రాంథికవాదులు గమనించలేదు. ఆంధ్ర శబ్ద చింతామణి మీద గల తెలుగు వ్యాఖ్యలో "ఇంచు గాగమము వస్తే వక్ష్యమాణమాత్రము చేత, 'ఉక్ష్' వస్తే అని వుంది" అని అప్పారావుగారు డిసెంటు పత్రంలో ఉదహరించేరు.

'చేస్తాడు', 'వస్తాడు', 'తెస్తాడు' వంటి నిష్యదర్థక క్రియారూపాలు గ్రామ్య రూపాలని చిన్నయకాలంనుంచీ తోసిరాజనడం జరుగుతున్నా కన్నడ, తమిళ, మళయాళ భాషల్లో వీటికి సారూప్యత గల క్రియారూపాల్ని తీసుకుని, సాదృశ్య పరిశీలన చేసినట్లయితే. గ్రామ్యాలని భ్రమపడే యీరూపాలే శుద్ధమైనవనిన్నీ, ద్రావిడ భాషా స్వభావాన్నిబట్టి, యివే సహజరూపాలనిన్నీ మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీలో ప్రొఫెసర్ గా వుండే శేషగిరి శాస్త్రిగారు చెప్పేరు.

వ్యావహారిక భాషలో బడిపిల్లలచేత చక్కని కాంపోజిషన్లు వ్రాయించడానికి 75 సంవత్సరాల క్రిందట చేసిన ప్రయత్నం యిది. కాలంతోపాటు భాష మారుతూ వుంటుందనేది పండితులకు తెలిసిన విషయమే. పూర్వంలాగ గ్రాంథిక గ్రామ్య భాషావాదుల మధ్య వివాదాలు లేవు. శిష్టవ్యావహారికంలో వ్రాసినా, రచన రసరమ్యంగా వుండాలనేది నిర్వివాదాంశం. "Style is the man" అనే లోకోక్తి అందరకు సుపరిచితమే. వ్యాసానికి ఒకవిధమైన రచనాపద్ధతి, చిన్న కథకు మరొక రకమైన రచనా పద్ధతి, నాటికకు వేరొకవిధానము, వకలకు యింకొక రచనామార్గము వుంటాయి. తెలుగుదేశంలో గల వివిధ విశ్వవిద్యాలయాల్లో ఆంధ్రభాషాశాఖకు చెందిన దిగ్దంతులు ఒక కమిటీగా ఏర్పడి అప్పారావుగారి డిసెంటుపత్రం యిచ్చే ప్రేరణతో, బడిపిల్లలకు విభిన్న సాహిత్య ప్రక్రియల్ని పరిచయంచేసి చక్కని శైలిలో రచనలు సాగించేలా పురికొల్పే ఒక ప్రణాళికను 8వ తరగతినుంచీ కాలేజీ క్లాసులవరకు రూపొందించాలి.

పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి గారు, చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు మొదలైనవారు చేసిన రచనలు కాలేజీ విద్యార్థులకు మేలుబంతులుగా ఉపయోగిస్తాయి. పండితసభలలో శాస్త్రవిషయాలను సంస్కృత పదజాలంతో యథార్థంగా మేళవిస్తూ శిష్టరంజకమైన పద్ధతిలో వివరించే విధానం చెళ్ళపిళ్ళవారి రచనలవల్ల సుబోధకమౌతుంది, అందుచేత శిష్టవ్యావహారిక భాషాసౌష్టవాన్ని విద్యార్థులకు బోధించే లక్షణగ్రంథం నేడు కావాలి. విశ్వవిద్యాలయాలు యీ విషయంలో తగిన కృషి చేస్తారని ఆశిద్దాం. ఇది యిలాగ వుండగా, తెలుగులో "యమ్‌ఫిల్" కోసం పరిశోధన చేసే విద్యార్థులు, డిసెంటుపత్రాన్ని తమ "రిసెర్చి సబ్జెక్టు"గా తీసుకుంటే బాగుంటుంది.

— స్వస్తి —

## కొత్త సంవత్సరంలో వెన్నెల కాయాలి

నిరాశాలోయల్లో బడి
ఆశయాల సమాలోచనలతో
నింగికేసి చూస్తున్నాం
నిరుపేదలమై అరుస్తున్నాం
మా బ్రతుకుల్లో మల్లెలు పూసేలా
ఈ కొత్తసంవత్సరంలోనైనా
వెన్నెల కాసేలా!

—శ్రీ కే. శ్రీశైలం

## 8. శ్రద్ధాంజలి

షిర్డీసాయిబాబా చరిత్రను ప్రబంధం గానే కాక వచనగ్రంథంగాకూడా వెలి యించి, అనేక సాహిత్యప్రక్రియల్లో తనదైన ఒక బాణీని నిల్పి పెక్కు సాహిత్య సంస్థల్లో క్రియాశీలసభ్యత్వం [illegible] శ్రీ నడిలోక మృత్యుంజయసహాయా [illegible] తీరం తన అరవైమూడవఏట రాజ [illegible] దివంగతులైనట్లు తెలిసి, [illegible] జిల్లాలోని పెక్కు సాహిత్య [illegible] వం వెలిబుచ్చాయి.

[illegible] లో స్థానిక సాహిత్య [illegible] హితి ఏర్పాటు చేసిన [illegible] రాయల కళాగోష్ఠి [illegible] ఆశావాది ప్రకాశరావు [illegible] సహాయాచారి పెక్కు [illegible] ను రాయల కళాగోష్ఠి [illegible] ఉపాధ్యక్షులుగా [illegible] త్యానికి ఎనలేని సేవచేశా [illegible] ల్లో "భావవీధి" అను [illegible] ప్రతిని ఆశావాది సాహితీ [illegible] రించిందని, అందులో [illegible] త్య చైతన్యాన్ని తెలిపే [illegible] పద్యాలు చోటుచేసు [illegible] ర్కొంటూ, ఆయన [illegible] ప్రపంచానికి తీరని [illegible] న్నారు. అనంత సాహితి [illegible] బత్తుల వెంకటరామిరెడ్డి [illegible] స్వర్గీయ సహాయాచారి [illegible] ని, సాహిత్యఅకాడెమీతో [illegible] మల తిరుపతి దేవస్థానం, [illegible] ణి కేంద్రాలు గుర్తించి, గౌర [illegible] యని ఆయన రచన "కలలో కళ" నాటక [illegible] కావ్యాన్ని ప్రచురించే భాగ్యం తమ [illegible] సంస్థకు లభించిందని ఆయన చివరి రచ నలు, "మిత్రచరిత్ర" మనే సూర్యస్తుతి, మార్కండేయ పురాణ వచన గ్రంథము అముద్రితాలుగానే వున్నాయని సాహిత్య సంస్థలు, దాతలు ముందుకు వచ్చి ఆయన అముద్రిత గ్రంథాలను ముద్రించాలని కోరారు. సమావేశంలో శ్రీ శేషపిళ్ళె కవి, శ్రీ లోకా జగన్నాథశాస్త్రి ప్రభృతులు ఆయనకు ఘనంగా నివాళు లర్పించారు. శ్రీ సహాయాచారి బ్రతికున్న రోజుల్లో ఏటేటా జన్మదిన కవిత వెలువ రించేవారనీ ఆ కవిత రసజ్ఞులను అలరించే దిగా వుండేదనీ ఆయన సాహిత్యకృషిని పరిశోధకవిద్యార్థు లెవరైన సమీక్షించ టం ఎంతైనా అవసరమని వక్తలు పేర్కొ న్నారు.

—శ్రీ బి. వెంకటరామిరెడ్డి

## 9. జీవితానికి హితం ఐకమత్యం

—శ్రీ కానూరు ఆదినారాయణ

సమాజంలో - సనాతనంగా
సాగిస్తున్న జీవితయాత్రకు
సురక్షిత హితం - ఐకమత్యం
సుద్దులు తెలిపిన పెద్దలు సుహితం
పలికి ఉన్నారీ పరమ సత్యం
అధునాతన యువతరానికి-నిత్యం
అందిస్తుంది మహాబలం-ఐకమత్యం
కాని- ప్రస్తుత ప్రపంచంలో
అడుగడుగునా - చెలరేగుతున్న
కులకక్షలు - అంటరాని తనం
పార్టీ పక్షపాత ధోరణులు
అనుక్షణం-అడ్డుపడ్డంవల్ల-కనిపిస్తున్నది ....
దీని ఆచరణలో శూన్యం
వర్గ విభేదాలు - కులతత్వాలు
మత తత్వాలు - మంట బెట్టి
మనిషిని మనిచేసి
మంట గల్పు తున్నాయి-ఐకమత్యం
స్వార్థ పూరిత సంఘాలు
దౌర్జన్య పూరిత కార్యాలు
అక్రమార్జనలు-ఆవేశపూరిత ప్రసంగాలు
అసత్య బోధనలు-అమలుకాని పథకాలు
ఉగ్రవాదం - వక్సలైటిజం
వీనిని సమూలంగా -అణగద్రొక్కినవాడు
అందరి జీవితాలకు హితం
అనాడే యీలోకానికి ఐకమత్యం!


## ❋ సమాలోచన ❋

జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

### యాజమాన్యము - వివరములు ఫారం IV (See rule 8)

| | | |
|---|---|---|
| ప్రకటించు స్థలము | : | రాజమండ్రి |
| ప్రచురణకాలము | : | ప్రతి 1, 16 తేదీలు |
| ముద్రాపకుని పేరు | : | శ్రీ బి. రవికాంత్ |
| పౌరసత్వము, చిరునామా | : | భారతీయుడు, 6-4-24, ఇన్నీసు పేట, రాజమండ్రి-1 |
| పబ్లిషరు పేరు | : | శ్రీ బి. రవికాంత్ |
| పౌరసత్వము, చిరునామా | : | భారతీయుడు, 6-4-24, ఇన్నీసు పేట, రాజమండ్రి-1 |
| సంపాదకుడు | : | శ్రీ బి. రవికాంత్ |
| పౌరసత్వము, చిరునామా | : | భారతీయుడు, 6-4-24, ఇన్నీసు పేట, రాజమండ్రి-1 |
| యజమానుడు | : | శ్రీ బి. రవికాంత్ |
| చిరునామా | : | 6-4-24, ఇన్నీసు పేట, రాజమండ్రి-1 |

నేను (బి. రవికాంత్) పైని ఈయబడిన వివరములన్నియు యథార్థములని ప్రకటించుచున్నాను.

(సం) బి. రవికాంత్


Editor, Printer and Publisher B. Ravikanth, Printed at B. V. & Co., Press,

శ్లో. శ్లిష్టమస్పృష్టశైథిల్య మల్పప్రాణాక్షరోత్తరమ్
శిథిలం మాలతీమాలాలోలాలికలిలా యథా॥
అనుప్రాసధియా గౌడై స్తదిష్టం బంధగౌరవాత్
వైదర్భైః మాలతీదామలంఘితం భ్రమరై రితి॥

ఈశ్లోకములకు నాజ్ఞానానుసారముగ నభిప్రాయమును వ్రాయుచున్నాఁడను. శ్లేషయన శైథిల్యము లేకుండుట యని మొదటిపాదమున శ్లేషలక్షణము చెప్పఁబడినది. అందలి శైథిల్యస్వరూపము 'అల్పప్రాణాక్షరోత్తరం శిథిలం' అని సార్ధద్వితీయ పాదమునఁ జెప్పఁబడినది. కోమలవర్ణమయ మైన శిథిల మనఁబడు నని తాత్పర్యము. ప్రథమశ్లోకోత్తరార్ధమున శైథిల్య ముదాహరింపఁబడినది. అనుప్రాసానురాగముచే గౌడులీశైథిల్యము నంగీకరించి రని "అనుప్రాసధియా గౌడై స్తదిష్టం" అనువాక్యముచేఁ దెలుపఁబడినది. వైదర్భులు బంధగౌరవము ననుసరించి శ్లేష నంగీకరించి శిథిలతను విడనాడిరి. ఉదాహరణము-మాలతీదామేత్యాది ద్వితీయశ్లోకశేషము. కోమలాక్షరమయ మైన గౌడి యనియును, మహాప్రాణా(కఠినా)క్షరము లుండిన వైదర్భి యనియుఁ దాత్పర్యము. ఇది యిటు లుండఁ బైశ్లోకము నిటు లాంధ్రీకరించిరి.

గీ. శిథిలత నొకించుకేని స్పృశింపని దయి
పరఁగుసూక్తి యల్పప్రాణవర్ణబహుళి
మగుచు శ్లేషగుణోజ్జ్వలం బగుశిథిలము
మాలతీమాలలోలాళినీల యనిన॥
కల పనుప్రాసమును బంధగౌరవంబు
నంచు నాదరింతురు గౌడు లారచనను॥

వైదర్భరీతి.

భ్రమరములచేత లంఘింపఁబడుచు నుండె
మాలతి యటన్న వైదర్భలాలితంబు॥

ఈరెండుపద్యములును సంస్కృతమున కెంత విరుద్ధములో యాలోచింపుఁడు. సంస్కృతములో శిథిలతాస్వరూపమును 'అల్పప్రాణాక్షరోత్తరం' అనుపదము బోధించుచుండ శిథిలతకు విరుద్ధ మగుశ్లే

షస్వరూపములో దీనిని యోజించిరి. వైదర్భమార్గమునఁ గారణమును బోధించు 'బంధగౌరవా'త్తనుదానిని, గౌడరీతి నాదరించుటలోఁ గారణమును బోధించుదానిగ యోజనము చేసిరి. ఆంధ్ర భాషయందు విశేషజ్ఞానము లేక నే నాపద్యములను వేఱుగ నన్వయించితి నేమో యుభయభాషాప్రవీణు లాలోచించెదరుగాక. నే ననుకొనినది సత్యమైనచో వీరిపద్యములంబట్టి వైదర్భరీతిని గౌడరీతిగను గౌడరీతిని వైదర్భరీతిగను బాఠకులు గ్రహింతు రని నానమ్మకము. వామనమతము ప్రకారము కావ్యాత్మ యగురీతిని గుఱించియే యీరీతి వైపరీత్య మున్నప్పు డలంకారశాస్త్రతత్త్వ మీగ్రంథమువలన నెట్లు గ్రహింపనగునో ప్రాజ్ఞు లాలోచించెదరుగాక. ఈగ్రంథములోని విరోధముల నన్నిటిని వివరించిన నొకగ్రంథమగు ననుభయముచేత నీయొక్క విషయము మాత్రము ప్రధానముగఁ జూపి విడిచితిని.

ఇఁక నాంధ్ర దశరూపకమును గూర్చి ముచ్చటింతము. దశరూపకప్రారంభమున-

అవస్థానుకృతి ర్నాట్యం రూపం దృశ్యతయోచ్యతే
రూపకం తత్సమారోపాత్ దశధైవ రసాశ్రయమ్
నాటకం సప్రకరణం భాణః ప్రహసనం డిమః
వ్యాయోగసమవాకారౌ వీథ్యంకేహామృగా ఇతి॥
అన్యద్భావాశ్రయం నృత్యం ............

ఆవశ్యకమయిన దీనివివరణము——

"నను, డోంబీ శ్రీగదితం భాణో భాణీ ప్రస్థానరాసకాః
కావ్యంచ సప్త నృత్యస్యభేదాః స్యుస్తేపి భాణవత్."

ఇతి రూపకాంతరాణామపి భావా దవధారణానుపపత్తి రిత్యాశం క్యాహ- "అన్యద్భావాశ్రయం నృత్యం" రసాశ్రయా న్నాట్యా ద్భావాశ్రయం నృత్య మన్యదేవ। తత్ర భావాశ్రయ మితి విషయభేదాత్ నృత్యమితి నృతేః గాత్రవిక్షేపార్థత్వేన ఆంగికబాహుళ్యాత్ లోకేపి చాత్ర ప్రేక్షణీయక మితి వ్యవహారాత్, నాటకాదే రన్యన్నృత్యం। తద్భేదత్వా చ్ఛ్రీగదితాదే రవధారణోపపత్తిః। నాటకాదిచ రసవిషయం। రసస్యచ పదార్థీభూతవిభావాది సంసర్గాత్మకవాక్యార్థహేతుకత్వాత్ । వాక్యార్థాభినయాత్మకత్వం రసాశ్రయ మిత్యనేన

దర్శితం, నాట్యమితి చ నట-అవస్పందనే ఇతి నటేః కించిచ్చలనార్థత్వా త్సాత్త్వికబాహుల్యం। అతఏవ తత్కారిషు నటవ్యపదేశః। యథాచ గాత్రవిక్షేపార్థత్వే సమానేపి అనుకారాత్మకత్వేన నృత్తాదన్యం నృత్యం తథా వాక్యార్థాభినయాత్మకా న్నాట్యా త్పదార్థాభినయాత్మకం అన్యదేవ నృత్యం"

దీనిలో నవసరమైన భాగమున కాంధ్రీకరణము. "రాసకాదులగురూపకంబు లనేకములుండ గాఁ బదియే యని యెట్లు నిశ్చయింపఁదగు ననుశంక కిట్లు సమాధాన మరయునది. "నృత్యమన్యము"

రసాశ్రయ మగునాట్యముకంటె భావాశ్రయ మగునృత్యము వేఱు. గాత్రవిక్షేపమే ప్రయోజనముగాఁ గలిగిన నృత్యమును జేయువాఁడు నర్తకుఁ డని చెప్పఁబడుటచేతను వాఁ డొనరించునృత్యము ప్రేక్షణీయక మని లోకమునందును లక్షణగ్రంథములందును వ్యవహరింపఁబడుటచేతను నాటకాదులకంటె నృత్యము వేఱగుచున్నది. ఇఁక నో నాటకాదులు రసవిషయకములు. రసమో విభావానుభావాది సంసర్గము గలదియై వాక్యార్థమె ప్రయోజనముగాఁగలది యగును. కావున నె వాక్యభావము నభినయించు నాట్యము రసాశ్రయ మని తెలుపఁబడినది. కించిచ్చలనము గలదినాట్య మనఁబడును. గాత్రవిక్షేపము సమానమె యయినను ననుకరణాత్మక మయిన నృత్తముకంటె నృత్య మెట్లు వేఱగునో యట్లు వాక్యార్థాభినయాత్మక మయిన నాట్యముకంటెఁ బదార్థాభినయాత్మక మయిననృత్యము సర్వథా వేఱని గ్రహించునది." పైసంస్కృతమున కీయాంధ్రీకరణ మేమి యు సంబంధింపకపోవుటయ గాక పాఠకులకు విపరీతార్థస్ఫోరక మగుచున్నది. దాని నంతను వివరించిన గ్రంథవిస్తర మగును గావున ముఖ్యములగు కొన్నియంశములను జూపెదను. నృత్యము గాత్రవిక్షేపమె ప్రయోజనముగాఁ గలిగిన దనియున్నది. సంస్కృతమున నృత్యశబ్దములోని నృతీధాతువునకు గాత్రవిక్షేప మని యర్థము, (అభిధేయము) గలదిగనుక యనునర్థములో నున్నది. సంస్కృతములో నభిధేయమను నర్థములో వాడఁబడిన యర్థశబ్దమునకుఁ బ్రయోజన మర్థ మనుకొని యావాక్యార్థమును విపరీతముగఁ జేసిరి. ఈవైపరీత్యమువలన నాట్యముకంటె నృత్యము వేఱనుటకు సంస్కృతమున నాలుగుహేతువులు

చూపఁబడియుండఁగా రెండు హేతువుల క్రింద సమన్వయింపఁబడినది. నృత్యమున నాంగిక బాహుళ్య ముండు నని యుండఁగా నా గ్రంథము నృత్యమునకుఁ గాత్రవిక్షేపము ప్రయోజన మని వ్యక్తీకరించుచు న్నది. మఱియు నాటక నాట్యశబ్దములకుఁ బ్రవృత్తినిమిత్తభేదమున్న దని యిచటిమూలమున నున్నను నాభేదమును గమనింపక నాట్య మనునర్థములో నాటకశబ్దము వాడఁబడినది. మఱియు రసము విభా వాదిసంసర్గము గలది యని యాంధ్రీకృతిలో నున్నది, సంస్కృతమున వాక్యార్థము విభావాదిసంసర్గాత్మక మనియు నట్టివాక్యార్థహేతుకము రస మనియు నున్నది. వాక్యార్థమునకు సమాసఘటకమై విశేషణ ముగానున్న 'విభావాది సంసర్గాత్మక' యనుదాని నీసమాసములోఁజే రని రసపదార్థముతో నెట్లు లన్వయించిరో తెలియకున్నది. అట్లు లన్వయింపఁ బ్రయత్నించినను సంసర్గము గలది యనునర్థ మెట్లులు గోచరించెనో తెలియకున్నది. ఇంతియగాక 'వాక్యార్థహేతుకత్వాత్' అని సంస్కృతమున నుండఁగా రసమునకు వాక్యార్థమే ప్రయోజన మని వ్రాయుటకుఁ గారణ మేమో కన్పట్టకున్నది. ఇచటి హేతుశబ్ద మునకుఁ బ్రయోజన మర్థ మనుకొనిరి కాఁబోలు. ఏది యెట్టులయి నను రసమునకు వాక్యార్థము ప్రయోజనమో వాక్యార్థమునకు రసము ప్రయోజనమో ప్రాజ్ఞ తెలుఁగనిది కాదు. మఱియు వాక్య భావము నభినయించునది నాట్య మని వ్రాసిరి. అభినయము నాట్య ము గాని యభినయించునది నాట్యము గాదు. అభినయించువాఁడు నటుఁడు, అనుకరణాత్మకమయినది నృత్త మని వ్రాసిరి. అది నృత్త ము గాదు నృత్యము. గ్రంథసమన్వయ మట్లుండఁగా నీనాలుగుపంక్తు లవలన,

1. నృత్యమునకు గాత్రవిక్షేపము ప్రయోజన మనియు
2. రసమునకు వాక్యార్థము ప్రయోజన మనియు
3. నాట్యము వాక్యభావము నభినయించు ననియు
4. నృత్త మనుకారాత్మక మనియు
5. రసము విభావాదిసంసర్గముగలది యనియును

ఈవిధముగ ననేకవిపరీతజ్ఞానములు గలుగు నని నాభయము. నేను బైనిజూపిన భాగములు గ్రంథప్రారంభములోనివి. స్థాలీపులాక

న్యాయమున నొక్క విషయమును జూపితిని, గ్రంథము నంతను విమర్శిం చుట నాపని గాదు. నా కట్టియోపిక యున్నచో నొక నూతనగ్రంథ మును వ్రాయుట మే లని నానమ్మకము. కావ్యప్రపంచనమున కలంకా రశాస్త్రజ్ఞానము ప్రాణమువంటి దనుతలంపుతో నీవిషయమునఁ బురో భాగిత్వ మవలంబింప సాహసించితిని. పైరీతి నాంధ్రాలంకారశాస్త్ర గ్రంథములను పాఠ్యగ్రంథములనుగా నియమించి విశ్వవిద్యాలయము వారాంధ్రభాషాజ్ఞానము నభివృద్ధిచేయఁ బ్రయత్నించుచున్నారు. ఈ ప్రయత్నమువలన నెట్టిఫలము సంభవించునో గమనించి యీపరిష త్తువా సుచితమార్గము నాలోచింపం బ్రార్థితులు.

కావ్యములు.

జనసామాన్యమునకు సదుపదేశమును జేయుకావ్యములు వాని యందలి చమత్కృతులచేత జనుల నాభిముఖ్యము నొనరించి పురు షార్థముల నుపదేశింపఁగలవు. కావున నవి రసప్రధానములుగ నుండ వలయును. రసము లోకోత్తరచమత్కారప్రాణము. కావున నె యానంద వర్ధనాచార్యాదులు కావ్యమునకు రస మాత్మ యనియును శబ్దార్థములు శరీర మనియు ను మాధుర్యాదులు శౌర్యాదులఁ బోలియు నలంకార ములు హారాదులనుబోలియు నాత్మోత్కర్షాధాయకము లనియుఁ దలం చిరి. రస మున్నచోఁ గావ్యము సజీవ మగును. అప్పుడే యలంకార ములు దానికి శోభ నొదవించును. రసము లేనిచో నవి శవాలంకార ములం బోలి శబ్దార్థములకు శోభ నొదవింపకుండుటయె గాక తమ శోభను గూడఁ బోఁగొట్టుకొనును. అలంకారములు లేకున్నను గుణ పుష్టిచే రసవంత మయినయాకావ్యము సద్గుణసంపద గలయోషామణి యలంకారశూన్య యయినను నుత్కృష్టలలో నగ్రగణ్యురా లయి నట్లే యగ్రగణ్యా మగును. కావునఁ గవి రసమును బోషింపఁ బ్రయ త్నింపవలయును. అట్టిప్రయత్నము చేయునపుడు వేఱుప్రయత్నమక్క ఱలేకయే యలంకారములు తమంతఁ దామె కావ్యము నలంకరింపఁ గలవు. అప్పుడే యలంకారములకు స్వస్వరూపము సిద్ధించును. కవి యలంకారములను జేర్చుటకు స్వతంత్రప్రయత్నము చేసినచోఁ దదా క్షిప్తహృదయుఁడై రసమును బోషింపఁజాలఁడు. అపుడాయలంకా

రములు జరద్వ్యోషిదలంకారములంబోలి యుండును. మఱియు రసనిష్పత్తి విభావాదులవలన నగును. కావున వానియౌచిత్యమును బాగుగ గమనింపవలయును. అం దనౌచిత్య మున్న రసభంగము కలుగును. అని యానందవర్ధనాచార్యులచే

"అనౌచిత్యాదృతేనాన్య ద్రసభంగస్య కారణం
ప్రసిద్ధౌచిత్యబంధస్తు రస స్యోపనిషత్పరా"

అని స్పష్టపఱుపఁబడినది. కావున నౌచిత్యమును ముఖ్యముగఁ బాటింపవలయును. రసములలో శృంగారరసము సర్వజనాస్వాద్య మయినట్లు లితరములు గావుగనుక శృంగార మన్నిటికన్నఁ బ్రధాన మయినది. దీనితరువాతిదివీరరసము. ఈయభిప్రాయముతోడనే "ఏకఏవ భవేదంగీశృంగారో వీరఏవవా" అని యీరెంటికిని బ్రాధాన్య మంగీకరించిరి. ఈరెంటిలోఁగూడ 'వీర ఏవ వా' అని యనాస్థాబోధక 'వా' కారమువలన వీరరసమున కప్రాధాన్యము సూచింపఁబడినది. ఈప్రాధాన్యాప్రాధాన్యము లధికాల్పసంఖ్యాకజనాస్వాద్యతనుబట్టి యేర్పడినవి. కావుననే శాంతరస మత్యల్పసంఖ్యాకజనాస్వాద్య మగుటచేత నది రసమే కా దని కొందఱును, రస మయినను శ్రవ్యకావ్యములలో నుండవచ్చును గాని దృశ్యకావ్యముల నుండఁగూడ దని కొందఱు నభిప్రాయ మిచ్చిరి. కావున శృంగారరసప్రధానకావ్యములె సర్వజనోపకారకములు. ఈతలంపుతో మనపూర్వులు శృంగారప్రధానకావ్యముల నెక్కువగా రచియించిరి. ప్రస్తుతకాలమున నవనాగరకత వ్యాపించినకొలఁది శృంగారకావ్యములఁ బాఱఁదోలవలయు ననునభిప్రాయము కొంతవఱకు లోకమున వ్యాపించినది. ఇట్టియభిప్రాయము వ్యాపించుటకుఁ గొన్ని శృంగారప్రబంధము లౌచిత్యమును మీఱి యుండుటయె కారణ మని నానమ్మకము. ఔచిత్యమును బాటించిన నిట్టియభిప్రాయములు వెలువడవు. ఒకనాయిక స్వాభిలాష నుచితమైన యంగభంగవిశేషముల సూచించినట్లులు వర్ణించిన నెంత మధురముగా నుండునో గ్రామ్యవ్యవహారరూపమున వ్యక్తీకరించిన నంతగర్హ్యముగ నుండును. ఈగర్హ్యత కనౌచిత్యమె కారణము కావున నౌచిత్య మవలంబించి శృంగారప్రబంధముల రచియించుట యావశ్యకము. ఆప్రబంధములు రసవంతములై నీతి, ధర్మము, మొదలగు మంచివిషయముల నుపదేశించునవి

గా నుండవలయును. లేనిచో నవి "కావ్యాలాపాంశ్చ వర్జయే"త్తను నిషేధగోచరము లగును. ఇఁక దృశ్యకావ్యము లాంధ్రవాఙ్మయమున స్వతంత్రములు లేనే లే వని చెప్పవచ్చును. శ్రవ్యకావ్యములకంటె దృశ్యకావ్యము లభినేయార్థము లగుటచేత నౌచిత్యభరితము లై యుండవలయును. వానియం దేమాత్రమైన ననౌచిత్య మున్నను రసభంగము కలుగుటయె గాక మీఁదుమిక్కిలి జుగుప్సకూడఁ గల్గును. కావున నె శయనాధరపానాదులు వర్జనీయము లని చెప్పిరి. ఇపుడు నాట్యరంగములందు వానిం జూపుచున్నారు. వానిం జూచినపుడు సహృదయులమనంబుల వైకల్యము కలుగక మానదు. జయంతజయపాల మొదలగు నాటకములం జూచినపుడు ప్రాజ్ఞులు విశ్వసించెద రని నానమ్మికము. ఇఁక సంస్కృతనాటకములను గొన్నింటిని మనవా రాంధ్రీకరించిరి. అందు వ్యంగ్యభూతము లగురసభావాదు లనేకములుండఁ జాలచోటుల వాచ్యార్థమే భేదించె నని నే ననుకొనియెదను. చూడుఁడు- ఉత్తరరామచరితమున సీతనుగూర్చి రామవాక్యములో-

శ్లో. ఇయంగేహేలక్ష్మీ రియ మమృతవర్తిర్నయనయో
రసా వస్యా స్స్పర్శో వపుషి బహుళ శ్చందనరసః
అయం కంఠేబాహు శ్శిశిరమసృణో మౌక్తికసరః
కిమస్యా నప్రేయో యది పరమసహ్య స్తు విరహః.

అని యున్నది. దీనియాంధ్రీకరణమున—

చం. ఇది గృహలక్ష్మి నేత్రముల కియ్యది యారా నమృతంపువర్తి దీ
నిది యగుతాఁకు దేహమున స్నిగ్ధలచందనగంధలేపనం
బిది శిశిరంబు మౌక్తికసరేద్ధభుజంబు గళంబునందు దీ
నిది సకలంబు సహ్యము వినింద్యవియోగ మొకం డసహ్య మౌ.

సంస్కృతమున సీతాస్పర్శయందు చందనరసతాదాత్మ్యమారోపితము. తెలుఁగులో చందనలేపనతాదాత్మ్య మారోపితము. సంస్కృతములో నారోప్యమాణము శైత్యాశ్రయము కావున శీతలత సాధారణధర్మమై రూపకనిర్వాహకమై చల్లని స్పర్శ యని స్ఫురింపఁ జేయును. తెలుఁగున నారోప్యమాణము శీతలతాజనకము సాధారణధర్మమై స్పర్శ చల్లఁదనమును బుట్టించుచున్న దని స్ఫురింపఁ జేయుచున్నది. దీనియం దెంతచమత్కారము లోపించినదో ప్రాజ్ఞులు గ్రహింపకపోరు.

మఱియు నిట గంధశబ్దము పునరుక్తము. సంస్కృతమునందలి రసశబ్దము లేకుండుట కూడఁ జమత్కారభంజకమే. తృతీయచరణమునఁ గంఠలగ్న బాహువునందు మౌక్తికసరతాదాత్మ్యారోపమున్నది. తెలుఁగున రూపకమే కానరాదు. "మౌక్తికసరేద్ధ" మౌక్తికసరమును బోలి దీపించు చున్న యని గాని మౌక్తికసరముచే దీపించుచున్న యని గాని యర్థము చెప్పవలయును. మొదటియర్థమున రూపకోపక్రమమున నుపమక్రమభంగదూషితము. రెండవయర్థమున సీతబాహువునందు మౌక్తికసరమున్నట్లు స్ఫురించును.

ఈపద్యములోని నాల్గవపాదపు మొదటివాక్యమును జూడుఁడు. ఈవాక్యము పూర్వోక్తము లన్నియుఁ బీడాకరము లని స్ఫురింపఁజేయుచున్నది. సహ్యముగా నున్నదని పీడాకరములఁ గూర్చియే వాడుదురు. కావున నీవాక్యము సహృదయుల కెటు లుండునో యాస్వరూపమును చతుర్థచరణాంతపదమే బోధించుచున్నది. "దీనిది ప్రియమేది కాదు" అని యున్నచోఁ గొంత బాగుండును. ఇటులసరిచేసి చూచినచో నూటికిఁ దొంబదిలో భేద ముండక మానదు. కొంతకాలమున కీయాంధ్రీకరణములం జూచి తృప్తినొంది సంస్కృతములోని సార మాంధ్రభాషలోనికివచ్చిన దనియు సంస్కృతముతో మనకవసరములే దనియు నభిప్రాయము లోకమున వ్యాపించినచో మనజ్ఞాన మెంతహీనదశ పొందునో యని భీతికలుగుచున్నది.

### వ్యాకరణములు.

తెలుఁగుభాష కిదివఱకుఁ గొన్నివ్యాకరణము లున్నవి. ఇవి భాషకుఁ జాలవు గాన సమగ్రమగు వ్యాకరణము లుండవలయు నను నభిప్రాయ మందఱకును గలిగినది. ఈయభిప్రాయము ననుసరించి "యాంధ్రభాషానుశాసనమను పేరితో నొకవ్యాకరణము వ్రాయఁబడినది. ఇదివ్యావహారికభాషావాదుల తృప్తికై వ్రాయఁబడినయటులు గాన్పించుచున్నది, గాని, యెట్టిభాషకు సాధుత్వము చెప్పఁబూనిరో తెలియకున్నది. ఈగ్రంథప్రారంభములో "వచ్చాను" అనునది శిష్టవ్యావహారికమైనను సత్కవిప్రయుక్తము కాలేదు కావున నపభ్రంశము" అని చెప్పి, వెంటనే "దానిని (బాలవ్యాకరణమును) బట్టి పూర్వకవులు ప్రయోగించిన బహుశబ్దము లపశబ్దము లనేడి భ్రాంతి యిప్పటి

వారికిఁ గలుగుటచేతను దానిని వారించుటకును బూర్వకవి సమ్మతము లు తత్తుల్యములు నైన శిష్టవ్యావహారికములు సాధువు లని తెలుపుటకును నీయనుశాసన మావశ్యక మగుచున్నది" అని వ్రాయఁబడెను. పూర్వకవిసమ్మతము లసాధువు లని యెవరు చెప్పుదురు. తత్తుల్యముల నుచోట సాదృశ్యమునకుఁ బ్రయోజకధర్మ మేదియో తెలియదు. అయ్యది యీగ్రంథమునఁ జూపఁబడలేదు. ఈగ్రంథకర్త యీవాక్యములలో వాడినశిష్టవ్యావహారిక మనుపదము తత్తుల్య మందురా? కాదందురా? కాదందురేని దీని నపభ్రంశ మని యొప్పుకొందురా? తత్తుల్య మందురేని "వచ్చాను" అనుపదము చేసినపాపమేమి? కావున భాషాస్వరూప మీయనుశాసనకర్తయొక్క యిచ్ఛలో నున్నటుల నగపడుచున్నది? కాన భాషాస్వరూపము మొదట సిద్ధముగా నుండవలయును. ఆస్వరూపసిద్ధికై శ్రీపీఠికాపురసంస్థానాధీశు లొక కోశమును "శ్రీసూర్యరాయాంధ్రనిఘంటు" వనుపేరితో మన కనుగ్రహించుచున్నారు. ఇట్టి యనుగ్రహమునకుఁ గృతజ్ఞులమై శ్రీవారికిని వారి కుటుంబమునకును నాయురారోగ్యైశ్వర్యసమృద్ధినిభగవంతుఁడు ప్రసాదించుఁగాక యని ప్రార్థించుట మన కవశ్యకర్తవ్యము. దానిమూలమున భాషాస్వరూపమును మనము దెలిసికొని తదనుకూల మగుసమగ్రవ్యాకరణమును వ్రాయఁబ్రయత్నింపవలయును. ఆవ్యాకరణ మాంధ్రభాషయందును తద్వ్యాకరణములయందును సంస్కృతభాషావ్యాకరణముల యందును నాఁతేఁటినవారు పూనికొనిరచియింపఁదగినది. అన్నిటియందును పరినిష్ఠితుఁ డొకఁ డుండఁబోఁడు. కావున, వేర్వేఱు పండితుల నొకసంఘముగ సమకూర్చి తన్మూలమున రచియింపఁబడినచో మంచి వ్యాకరణము లభియింపఁగలదు. లేనిచో లాభము లేదు. ఈభాషానుశాసనమందు, "క్, చ్, మొదలగునవి మాత్ర లనంబడును. ఒక్క మాత్ర పలుకుటకుఁ బట్టినంతటికాలము పట్టునట్టి అచ్చుహ్రస్వము" అని యున్నది. ఈగ్రంథమునుబట్టి హల్లునకును హ్రస్వ మగునచ్చునకును నుచ్చారణకాలము సమ మని స్పష్ట మగుచున్నది. ఆంధ్రభాషాసంప్రదాయము నాకుఁ దెలియదు గాని సంస్కృతసంప్రదాయమునుబట్టి యాలోచింప నరసిద్ధాంత మగక లేకున్నది. అచ్చులకపడములలోని హల్లు

లకును హ్రస్వము లగు నచ్చులకు ను సమకాలము కల్పింపసాహసిం చినను దత్సమపదములలోని వానికిని గూడ సమకాలతను గల్పింప సాహసించెదరా? మఱియు "సంస్కృతావ్యయములలోనివైన యుప సర్గలు తత్సమములైన విశేష్యవిశేషణధాతువుల మొదటఁ జేరి కనఁ బడుచుండును గావున వానిని గూడ నుదాహరించెదను. ప్ర॥ ప్రదే శము, సు॥ సుగుణము, దుర్॥ దుర్జనుఁడు." పూర్వవాక్యార్థమున కివి నె ట్లుదాహరణము లగునో ప్రాజ్ఞు లాలోచింతురుగాక. పరకీ యదోషాన్వేషణముతోఁ బనిలేదు. సంస్కృతవ్యాకరణమున మంచి జ్ఞానము గలవారిసహాయమును గూర్చుకొని వ్యాకరణరచన చేయవ లయునుగాని కేవలాంధ్ర పండితులు చేయఁదగినపని కా దనినాతలంపు.

## విమర్శగ్రంథములు.

ఇదివఱకు నేఁజూచిన కొన్నివిమర్శనగ్రంథములలోఁ గవియొ క్క జాతి, కాలము, శాఖ, దేశము, ఈవిధము లగునంశములు కన్న డుచున్నవి. పిమ్మట నందలి దోషముల నిరూపించుటకుఁ జాలఁబ్ర యత్నించినట్లు కన్పడుచున్నది. ఈవిమర్శల కుపయోగము లే దని నేను జెప్పను గాని ముఖ్యముగ విమర్శ లీవిధముగ నుండవలయు నని నాయాశయము. బోద్ధలు రసాభిముఖులై గ్రంథములం దిమిడి యున్న సదుపదేశములను గ్రహింపవలయు ననుముఖ్యోద్దేశముతోఁ గవి కావ్యములను వ్రాయును. ఇందలి ప్రధానరస మేది? అంగరస ము లెవ్వి? ఆరసము లంగిరసము నెట్లు పోషించినవి? ఇందు విభావా దు లుచితముగ వర్ణితములా? ప్రతివాక్యమును వ్యంగ్యవైభవము గలదై యున్నదా? అలంకారము లాయావ్యంగ్యోపస్కారములుగ ను న్నవా? గుణముల రచన రసానుగుణముగ నున్నదా? ఈమొదలగు విమర్శలున్నచోఁ దత్పరస్పరముగ నాగ్రంథమును జదివిన సహృద యుల కానందము గల్గును. ఇట్టి విమర్శల కలంకారశాస్త్రజ్ఞానము ము ఖ్యము. ఇట్టి విమర్శలు రసవత్తరములైన ప్రాచీనప్రబంధముల కన్నిటికిని గావలయును. ఆంధ్రభాషకు సంస్కృతభాషాజ్ఞాన మావశ్యకము. ఆం ధ్రభాషసంస్కృతభాషాగర్భితమయి యున్నది. నన్నయభాష సంస్కృ తపదభూయిష్ఠము. తిక్కనభాష సమసంస్కృతమైయున్నది. ప్రబంధము

లన్నియు సంస్కృతప్రచురములై యున్నవి. అచ్చతెనుఁగు కావ్యములు కొలఁదిగ నున్నను నవి మిగిలినగ్రంథము లంత సుబోధములు గావు. సుబోధముగ నుండునదియె కావ్యము లేనిచోఁ బ్రసాదగుణవిరహిత మై రసస్ఫోరకము కాఁజాలదు. కావున సంస్కృతభాషాజ్ఞానము కూడ నున్ననే రసాస్వాదము కలుగును. తెలుఁగుగ్రంథములలోని సాంస్కృతభాషామూలమునఁ గలిగిన సంస్కృతభాషాజ్ఞానము చాలు ననుట లోకవ్యవహారమూలమునఁ గలిగినయాంధ్రభాషాజ్ఞానము ప్రబంధములయందలి రసాస్వాదమునకుఁ జాలు నన్నట్లుండును. కావున స్వతంత్రముగ నాయాభాషలయందు జ్ఞాన మావశ్యకము. అన్నిభాషల కంటెను సంస్కృతభాషకు వ్యాకరణనిర్బంధ మధికము, కావున, వ్యాకరణజ్ఞానపూర్వక సంస్కృతజ్ఞానమును మన మభిలషింపవలయును. ఇప్పటివిద్యాసంవిధానమున సంస్కృతములో వ్యాకరణమును మూలఁద్రోసి కొంచెపుభాషాజ్ఞానమును సహకారముగఁజేసికొని తెలుఁగునందు ప్రవీణులగుటయేకాక యుభయభాషాప్రవీణులుగూడ నగుచున్నారు. అట్టిజ్ఞానము భాషకు విశేషించి యుపకరించునది కాదు. ఇపుడు (1) శిష్టవ్యావహారికము (2) గౌరవనీయులు (3) బానిసేయులు (4) ప్రాముఖ్యత మొదలగుపదములు నూతనముగ గ్రాంథికములగుచున్నవి. ఇది భాషకుఁ గళంక మని నాతలంపు. ఇట్టికళంకమును దొలఁగింపఁ బ్రయత్న మత్యావశ్యకము.

మహాశయులారా !

వార్ధకలక్షణము లగుకొన్ని పిచ్చిపిచ్చిమాటలచేతఁ దమయమూల్య మగుసమయమును వ్యర్థముచేసినందుకు నన్ను మన్నింపుఁడు. మొదట నేదయతో నన్నీస్థానమునఁ గూర్చుండఁబెట్టితిరో యట్టిదయతో నాలోపములను క్షమింపుఁడు. ప్రసంగవశమునఁ బరకీయోక్తుల విమర్శించునపుడు నాపలుకులం గొంతపారుష్య మున్నను నది భాషాసేవాభిమానమూలకముగాని వేఱొకవిధముగాదని యెంచి మన్నింపుఁడు. భావికార్యక్రమమును భగవంతుఁ డనుకూలముగ నెఱవేర్చుంగాక.

స్వస్త్యస్తు.

---

# పాఠపరిశీలనము.

—విద్వాన్ దువ్వూరి వేంకటరమణశాస్త్రిగారు - చిట్టిగూడూరు-

ఆంధ్రవాఙ్మయము తాళపత్రములనుండి ముద్రితగ్రంథరూపమున నవతరించునపు డందలి యాంధ్రభాష నూతనరూపముం దాల్చియున్నది. ఈయవతారమున నెన్నియో పాఠములు తాఱుమాఱగుటచేఁ బలుతావులఁ బ్రాచీనకవుల భావములను గాని, ప్రయోగములవిషయమున నాయాకవుల సమ్మతిని గాని సరిగా గుర్తించుటకు వలను పడకున్నది. ఈయనర్థమున కీకాలపు గ్రంథసంస్కర్తల నిరాతంక మగుస్వతంత్రతయే చాలవఱకు మూల మని యెందఱో విమర్శకు లుద్ఘోషించుచునేయున్నారు. ఆయుద్ఘోషము బధిరశంఖారావ మగుచునే యున్నది. తొలుతఁ దాళపత్రమాతృకలనుండి పుత్రిక లవతరించునపుడే యర్థజ్ఞానశూన్యు లగు లేఖకాదుల ప్రమాదములవలనఁ గవుల ప్రయోగము లెన్నియో వ్యత్యస్తములై యనర్థాపాదకము లయినవి. ఇట్టియెడ ముద్రణావసరంబుల సంస్కర్తలు శ్రద్ధఁబూని ప్రాచీనతాళపత్రగ్రంథముల సాకల్యముగఁ బరిశీలించియు, నందలిపాఠభేదముల యథాస్థితంబుగఁ జూపియుఁ దత్తన్మూలగ్రంథములను దత్తద్విప్రణీతము లగునితరగ్రంథభాగములను బరిశోధించియు, లేఖకాది ప్రమాదముల సప్రమాణముగ నిర్ణయించి సవరించియుఁ, దమసంస్కారప్రకారము నావశ్యక మగు పట్టులఁ బాఠకలోకమునకుఁ దెలియ వెలువరించియు నిట్టియనర్థమును యథావకాశముగఁ దొలఁగించి యుండవలసినది. అట్లుగాక వీరు పరిశోధనములం దుచిత మగు శ్రద్ధఁ బూనకుండుటచే నీయనర్థ మంతరించుటకు మాఱుగా మఱింత యధిక మయినది. ఇఁక దీనికయి చింతిల్లుటకంటెఁ దగిన ప్రతీకార మొనర్చుట భాషోపకారకము. ఆప్రతిక్రియ విమర్శకాయత్తము. విమర్శకులు ముద్రితగ్రంథముల నెల్లఁ దాళపత్రాదిమాతృకాసాహాయ్యమునఁ బరిశీలించి వలయుపరిశోధనములు గావించి యందుఁ గవిప్రయుక్తముల సప్రమాణముగ నిరూపించి యిట్టిపరిషత్తులఁ బండితుల యెదుటఁ జర్చించి వానిని బత్రికాముఖమునఁ బ్రకటించినచో మఱుఁగువడియున్న కవిప్రయోగతత్త్వమును జదువరులకుఁ దెలిపినవా రగుదురు. పరిశోధకులు దీని నుపేక్షింపఁ జన దని నావిన్నపము. ఇట్టిపాఠపరిశీలనసంబద్ధము లగుచర్చలు విమర్శకభూయిష్ఠము లగునీయాంధ్రసాహిత్యపరిషత్సమావేశములందే జరుగకున్నచో మఱి వీనికిఁ దావులేదు. ఇఁక బ్రకృతాంశమునకు సమీపింతము.

ఆంధ్రసాహిత్యపరిషత్తువారు కొన్నియపూర్వము లగు ప్రబంధములను లక్షణగ్రంథములను ముద్రింపించి ప్రకటించియుండిరి. వీరు పయిని నిర్దేశింపఁబడిన సంస్కర్తలవలెఁ గాక, ముద్రణకాలముల కుపలబ్ధమయిన ప్రాఁతప్రతులను సావధానముగఁ బరికించియు, నందు లేఖక ప్రమాదజనితములు గఁదోఁచినవానిని న్యాయ్యదృష్టిని సవరించియుఁ, బాఠభేదము లున్నయెడ వాని నన్యథాకరింపక సాకల్యముగఁ జూపియు, సమన్వయసందేహము గలిగినపట్టుల నేదోయొకరీతిని సవరింపఁ గడంగక "యిత్యాదిసందిగ్ధ మ"ని సుస్పష్టముగ సూచించియు నీరీతిని విమర్శకసమ్మత మగుపద్ధతుల నవలంబించుట గడుం గడుఁ బ్రశంసనీయము. ఇ ట్లింతగా శ్రద్ధవహించినను నీగ్రంథముల ముద్రణములందుఁ గొన్నితావులఁ దత్తద్గ్రంథకర్తల యుద్దేశములకు భంగము వాటిల్లినట్లు గానవచ్చెడిని. పరిషత్ప్రకాశితము లగు గ్రంథములు సర్వథా యనవద్యము లయి యుండఁదగు ననుకోరికతో నచ్చటచ్చటఁ బాఠములఁ బరిశీలించి నాకభిప్రాయభేద మొదవించిన వానిలోఁ గొన్నిటి నీసమావేశమున సంగ్రహముగ వివరింపఁబూనితిని. ఇదియే యీనావ్యాసమునకు స్వరూపము.

(1) చంపూరామాయణము.

"మ. ధనువంశం బది విష్ణునంశ మగునాథానుష్ఠధారేయుచే
మనువంశంబుగతిఁ గుణోన్నతివహింపనోచి..." (ఆ-3—ప. 102.)

ఇందలి ధనువంశం బనునది పీఠిక 13 వ పుటలో లక్షణదుష్టముగ నుదాహరింపఁబడి యున్నది. మఱియు నీపద్యము నొద్ద (50 వ పుట) "ధనుర్వంశ మనుట కిది యపప్రయోగము." అని లిఖింపఁబడియున్నది. పరిశీలింప దీనిని సుశబ్దముగ సంస్కృతశాబ్దికులు సాధించియుండిరి.

భృ, మృ, శీ, తౄ, చరి, త్సరి, తని, ధని, మి మస్జిభ్య ఉః.॥ —సిద్ధాంతకౌముది—ఉణాది, ప్రథమపాదము; 7వ సూత్రము.

ఈసూత్రము క్రమముగా, భరుః, మరుః, శయుః, తరుః, చరుః, త్సరుః, తనుః, ధనుః, మయుః, మద్గుః, అనునుకారాంతశబ్దములను సాధించెడిని. ఇట భట్టోజిదీక్షితులు "ధనుః, శస్త్రవిశేషః. ధనుషాచ ధనుం విదుః- ధనురివాజని వక్ర ఇతి శ్రీహర్షః" అని సకారాంతముతోపాటుగ నుకారాంతము గూడ నున్నట్లు స్పష్టపఱిచిరి. ఇటఁ దత్త్వబోధినిలో "ధనుషా చేత్యాది.- ధనుషా సార్థం ధనుం విదు రి త్యర్థః-స్యాత్తను స్తనుషా సార్థ మిత్యతః సార్థమి త్యను

వజ్యతే- 'శుద్ధవంశజనితో౽పి గుణస్య స్థానతా మనుభవన్నపి శక్రః। క్షిప్తరేన మృజుమాశు సపక్షం సాయకం'ఇతి శ్రీహర్ష శ్లోక శేషః- (నైషధము-5-102)= 'ధను ర్వంశవిశుద్ధో౽పి నిర్గుణః కిం కరిష్యతి' ఇతి ధన్వన్తరిః-ఇహ పూర్వత్ర చ ధను రితి ఉకారాన్త స్సకారాన్తో వా బోధ్యః-నచ సకారాన్తధనుశ్శబ్దో నపుంసక ఏవేతి శఙ్క్యమ్- అథాస్త్రియామ్, ధను శ్చాపౌ' ఇత్యమరోక్త్యా తస్యాపి పుంస్త్వాత్" అని ధనుః అనునది సాంతమై పుంలింగముగ నుండుటయు, నుకారాంతమై యుండుటయు నిర్బాధకము లని జ్ఞానేంద్రసరస్వతులు సప్రమాణముగ వివరించియుండిరి. మఱియు సకారాంతధనుశ్శబ్దమును సాధించిన "అర్తి, పృ, వపి, యజి, తని, ధని, తపిభ్యోనిత్" (ఉణాది- 2 పా- 282 సూ)అను సూత్రమునొద్ద "ధనుర స్త్రియామ్- ధను ర్వంశవిశుద్ధో౽పి నిర్గుణః కింకరిష్యతి- సాన్తస్య ఉదన్తస్యవా రూపమ్"అని దీనియుకారాంతత్వమును దీక్షితులు మరల నుద్ఘాటించియుండిరి. ఇంతియగాక పయినైషధశ్లోకమునకు వ్యాఖ్య వ్రాయుచు మల్లినాథసూరియు "అయం శబ్దః ఉకారాన్తో ప్యస్తి" అని స్పష్టీకరించి యుండెను. ఇదియుఁగాక రాఘవపాండవీయమున "అనుపమదివ్యవిక్రమసమగ్రుఁడు..." (2 ఆ- 56 ప) అను పద్యపు వ్యాఖ్యలో ముద్దరాజు పెదరామధీమణి యు "ధనువును" ఉకారాన్తము 'సో౽యం ధను రజని నక్రః' అని నైషధమందుఁ బ్రయోగము. అని దీనియుదన్తత్వము నుల్లేఖించియుండెను. 'ధనుః' అనునది సాంతమై యున్నను'సాన్తాదపయః ప్రభృతే ర్లోపః' అను నాంధ్రశబ్దచింతామణిసూత్రముచొప్పున సకారలోపము కలిగి 'ధనువును' అను రూపము నిర్బాధకముగ సిద్ధించుచుండుటంజేసి దీనికయి యుకారాన్తశబ్దపరామర్శ మావశ్యకము గాకున్నను బ్రసంగవంశంబున నీవిశేషరూపమును గూడఁ బాఠకులకు బోధింపఁ దలంచి యిట్లీతఁడు పేర్కొనియుండును.

ఇవన్నియు నిటుండ సకారాన్తధనుశ్శబ్దమును బరిగ్రహించినను ధనువంశమను సమాసము సాధువగుట కాంధ్రవ్యాకరణములలోనే నిర్బాధక మగు మార్గ మొండుగలదు. "సాంతంబులతుది సకారంబునకు లోపంబు బహుళంబుగా నగు" (బాల- తత్స. 80 సూ.) నను సూత్రముచే ధనుస్ అనుదాని సకారమునకు లోపము రాఁగా "పువర్ణకేతరవిభక్తిపర మగుచో నుకారాన్తంబులకు బహుళంబుగా నోశబ్దంబునకు నిత్యంబుగా వుగాగమం బగు' (బాల- తత్స- 40 సూ) ననుసూత్రముచే వుగాగమము బహుళముగా విహితమ్మగుటచే ధనువు

యొక్క ధనుయొక్కయను రూపద్వయ మేర్పడును. అందు ధనుయొక్క యనుదా నితో వంశశబ్దమునకు సాధ్యసమాసము చేసినచో ధనువంశ మనుశబ్దము సిద్ధించును. ఇట్టి వృగాగమ విరహితరూపములు భాషలోఁ బెక్కులు గానఁనగును.

పయిని జూపినరీతి నుకారాన్తధనుశబ్దము సంస్కృతగ్రంథములలోఁ బ్రయుక్తమై ప్రామాణికసమ్మతమై యుండుటవల్లను, సాంతత్వపక్షమునఁ గూడ నాంధ్రవ్యాకరణములచే నీసమాసము సాధు వగుచుండుటవల్లను ధనువంశం బనునది సర్వథా సాధు వనందగును గాని యపప్రయుక్తం బనియు లక్షణదుష్టం బనియు నిరసింపఁ దగదని నానిశ్చయము.

(2) చంపూరామాయణము.

"చ. సుమతి నృపాలుఁ డేలుపురిఁ జూతమనం జని ముప్ప్వ రాధరా
రమణుసపర్యఁ గైకొని పురందరుఁడే జడదారి నారిపైఁ
దమి గతశోకుఁడై పిదపఁ దాల్చె నజాండభరంబు నట్టి గౌ
తమముని యున్నయాశ్రమపదంబుకుఁ నంగట త్రోవఁ బోవఁగన్" (3-29)

పరిషద్గ్రంథాలయములోని తాళపత్రమాతృకలోఁగూడ నీపద్యమున 'గతశోకుఁడై' యనియే లిఖింపఁబడియున్నది. ఈసందర్భమున నీగ్రంథమునకు మూలభూతమగుభోజచంపువును బరిశీలింపనందిక్రిందిపద్యములు గానఁనగును.

అత్రాగమన్త్రాతమధన్నదారా ననార్యజుష్టేనపథా మహేన్ద్రః।
సచక్రుధా నిర్వృషణం వృషాణం భార్యామదృశ్యాం చ మునిశ్చకార॥
ఇత్థం విదితవృత్తాన్తే దేవతానాం గణే తదా।
పితౄణాం ప్రాభవాల్లేభే మేషస్యవృషణం వృషా॥ (బాల- 146, 149)

ఈశ్లోకములం దహల్యను వలచిన యింద్రుఁడు ముష్కశూన్యుఁ డగునట్లు గౌతమునిచే శప్తుఁ డయి పితృదేవతామహిమచే మరల మేషాండమును బొందినట్లు వాల్మీకిరామాయణప్రసిద్ధ మగుగౌతమశాపవృత్తాంతము సంగ్రహింపఁబడియున్నది. పయిని జూపిన తెలుఁగుపద్యమునం దీవృత్తాంతము తిరోహితమయినది.

కవి యీశాపప్రసంగము దిగవిడిచి యుండఁ డనియు, మూలమునందలి 'నిర్వృషణ'మ్మనుదానిని 'గతకోశుఁడై' యని యాంధ్రీకరించియుండు ననియు, లేఖకప్రమాదమున విపరీతార్థప్రద మగువర్ణవ్యత్యయము (కోశు=శోకు)

జరిగియుండుననియు మనమూహించుట న్యాయ్యము గాన "గతకోశుఁడై" యనునది కవిప్రయుక్తముగ నిశ్చయింపఁదగు నని నాయాశయము.

(3) శివరాత్రిమాహాత్మ్యము.

క. "మీకును మీపతియానతి, మాకును మాభర్తయాజ్ఞ మన్నింపఁదగుఁ
వాకోవాక్యములవెడ, వాకొట్లంబల్బుజంబు వలవదు సేయన్" (4ఆ-70ప)

ఇటఁ బరిషద్గ్రంథాలయమునందలి తాళపత్రమాతృకలోఁ గూడ 'వాకావవాక్యముల' యనియే యగపడుచున్నది. ఈపద మర్థశూన్యమై యుండుటవలన దీనికడఁ బ్రశ్నార్థకచిహ్నము(?) ముద్రిత మయినది. పయిపదము లేఖకప్రమాదపతిత మగుటకు సందియము లేదు.

మహాభాష్యము పస్పశాహ్నికమున "మహాన్ శబ్దస్య ప్రయోగవిషయః—సప్తద్వీపా వసుమతీ, త్రయో లోకాః, చత్వారో వేదాః, సాఙ్గాః సరహస్యాః, బహుధా భిన్నా ఏకశత మధ్వర్యుశాఖాః, సహస్రవర్త్మా సామవేదః, ఏకవింశతిధా బాహ్వృచ్యమ్, నవధా థర్వణో వేదః, వాకోవాక్య మితిహాసః పురాణం వైద్యక మి త్యేతావాన్ శబ్దస్య ప్రయోగవిషయః- ఏతావన్తం శబ్దస్య ప్రయోగవిషయ మననునిశమ్య సన్త్యప్రయుక్తా ఇతి వచనం కేవలం సాహసమాత్ర మేవ" అని శబ్దప్రయోగ విషయనిరూపణ సందర్భమునఁ బతంజలి భగవానులు వాకోవాక్యపదమును వ్యవహరించి యుండిరి. "వాకోవాక్యశబ్దేన ఉక్తి ప్రత్యుక్తిరూపో గ్రన్థ ఉచ్యతే, యథా; కింస్విదావపనం మహత్? భూమి రావపనం మహత్" అని కైయటోపాధ్యాయులు దీనియర్థమును వివరించియుండిరి, దీనిం బట్టి వాకోవాక్యము లనఁ బ్రశ్నోత్తరరూపము లగుగ్రంథములని తెలియుచున్నది.

శివరాత్రిమాహాత్మ్యమున సుకుమారుఁడు మరణించినసందర్భమున నాతఁడు నీచాతినీచము లగుమహాపాతకము లసంఖ్యాకముగ నొనర్చినవాఁ డగుటచే యమలోకమునకుఁ గొని పోవ యమదూతలును, శివరాత్రిసమయంబున నాగేశ్వరశంభుసన్నిధిని యాదృచ్ఛికంబుగ జాగరణంబు చేసి యుంటచేఁ గైలాసంబునకుఁ దోడ్కొనిపోవ శివదూతలును నాతనికడ కేఁగి పరస్పరము గలహింతురు. ఇప్పట్టున నాయుభయపక్షములకును సుదీర్ఘముగఁ బ్రశ్నోత్తరములు ను వాదప్రతివాదములు ను నడచినపిమ్మట నీప్రకృతపద్యము గలదు. ఈసందర్భమున నుక్తిప్రత్యుక్తు లను నర్థ మొంతయుఁ బొసఁగియుండుట

వల్లను, శ్రీనాథమహాకవి కృతులయం దనేకస్థలముల శాస్త్రవ్యవహారమూలకము లగుపదములు వెలయు చుండుటవల్లను, "పన్నగపతిసార్వభౌమభాషితమహాభాష్యవిద్యాసముభ్యాసబలము" మ న్నగువాక్యములచే నాతనికి మహాభాష్యప్రయోగములు సుపరిచితము లని యూహింపఁ దగి యుండుటవల్లను నిట "వాకోవాక్యమ్ముల వెడ, వాకాట్లన్" అనుపాఠము గవిప్రయుక్తముగనిర్ణయింపఁదగు నని నాతలంపు. ఈప్రయోగమును బ్రమాణముగఁ గొని యీపదమును సూర్యరాయాంధ్రనిఘంటువునఁ జేర్చుట సమంజస మని యు నాయాశయము.

(4) శివరాత్రిమాహాత్మ్యము.

"ఎఱుఁగునే పీడకన్నను నెండకన్నుఁ, జెలఁగి పూఁచు నేకర్షవంచిన లతాంగి
యెట్టిక్లేశంబులకునైన నీడఁబోదు, తనమనంబున నిగ్రుచుసంతానకాంక్ష."

(2. ఆ. 39 ప.) ఇందలి 'వంచిన' యనుపాఠమే తాళపత్త్రమాతృకలోఁ గూడఁ గాన వచ్చెడిని.

ఎన్నండును లేశముగ నయినఁ గ్లేశ మెఱుఁగని కోమలాంగి యగునాసుశీల పుత్త్రోదయసాధనంబుగ నెవ రేకర్ష నాజ్ఞాపించినను దానఁ గలుగు నెంతటిక్లేశము నయిన సంతానకాంక్ష చే గణింపక యాయాకర్షల నుత్సాహంబుతోఁ బూని యాచరించెడిదని పయిపద్యమునకు భావము. ఇందు 'ఏకర్ష వంచిన' యనుచో వకారము నాదేశనిష్పన్నముగ భావింపవలసియుండును.

ఒకమహారాజునకుఁ బ్రధానామాత్యుఁ డై రాజ్యభార మంతయుఁ దానే వహించి యున్న యజ్ఞదత్తునికి భార్య యై మహాభాగ్యశాలిని యగు నీసుశీల కాజ్ఞాపించువారు సామాన్యులుగా నోపరు. గురుజనులో లేక యంతటి మాన్యులో యై యుండవలయును. అట్టి గురుజనులయాజ్ఞ దనకుఁ గ్లేశదాయక మయినను వారియెడ గౌరవాతిరేకముచే శిరసావహించి దాని నెఱవేర్చుట వినయవతియు వివేకవతియు నగుసుశీలకు సహజధర్మ మై యున్నది. ఇట్లుండ సంతానకాంక్షచే గురుజనాజ్ఞను బాలించిన దనుట సరసముగఁ గానరాదు. అది కవిహృదయము గానేరదు.

ఎట్టిసామాన్యజనులవల్లనయిన నేకర్షవిషయము వినఁబడినను దానినెల్ల నాచరించెడి దనుటలో విశేషము గలదు. అట్లు చెప్పిననే సంతానకాంక్షచే ననుహేతువు సార్థక మగును. ఇది యిట్టుండ శివరాత్రిమాహాత్మ్యములోని

యనేక భాగములకును విశేషించి యీ ప్రకరణమునకును మూల మనఁ దగిన బాణునికాదంబరిలో నీసందర్భమున "యద్యచ్చ కించిత్ కుతశ్చిత్ శుశ్రావ, గర్భతృష్ణయా తత్త త్సర్వం చకార న మహాన్త మపి క్లేశ మజీగణత్" అను వాక్యములు గానవచ్చును. వీనింబట్టి గురుజనులవల్లనే గాక నెవ రెవరివలన నేదేది విన్నను దాని నెల్ల నాచరించెడి దనియే బాణకవియాశయము విశద మగుచున్నది. కావున నెవ రేని దమలోఁ దాము చెప్పుకొనుచున్నను నాక స్మికముగ విని యాకర్ణలలోఁ దన కేది యుపకరించునో యనుతలంపుతోను వానినెల్ల నాచరించెడి దనుటలోని స్వారస్యమును బాటించి శ్రీనాథుఁడు మూలమునందలి 'శుశ్రావ' యనుదాని కనురూపముగ 'వించిన' (వినిచిన యనుదాని రూపాంతరము) యని ప్రయోగించి యుండు ననుట సమంజసము. వినుచు ధాతువునకు వినవచ్చు (వినఁబడు) ననునర్థము కవ్రులవాడుకలోఁ గలదు. "..........కడుం జిత్రంబుతో దన్వ్వలన్ వినిచెన్, మానవభాషణం బులు గడున్ విస్పష్టమై వీనులన్" (భోజరాజీయము) మున్నగు ప్రయోగము లరయఁదగును. పయిసందర్భములంబట్టియు, నెవరో చెప్పికొనఁ బరోక్షముగ వినవచ్చిన కర్తల నామె యాచరించెడి దనుటవలన నితరులు పనిఁబూని తెలి పినట్టియు గురుజనాదు లాదేశించినట్టియుఁ గర్తల నామె యాచరించుట కై ముతికన్యాయసిద్ధమై సంతానకాంక్షాస్వరూపరహస్యము తేటతెల్లమయి ప్రకృ తమున నెంతయు నింపు నాపాదించుచుండుటంబట్టియు నిట 'వించిన'యను పాఠమే శ్రీనాథప్రయుక్తము గాఁబోలు నని నాయుద్దేశము.

(౫) కవిజనాశ్రయము.

కోమలీవృత్తము. జననుతకీర్తి నజాయగణంబుల్
ఘనంబుగా జధసరకారంబుతో
ననుపములై యుభయార్థములందున్
బెనంగఁ గోమలి యనుపే రొప్పగున్." (వృత్తాధి-137 ప.)

భీమకవి వృత్తాధికారాంతమున నర్థసమవృత్తములను స్వస్థానార్థసమ ములు, పరస్థానార్థసమములు నని రెండుదెఱంగులుగ విభజించి వాని కొఱు దాహరణంబులఁ జూపి యుండెను. అం దిది నాల్గవయుదాహరణము.

ఇప్పట్టున భీమకవి తానావఱకు నిర్దేశించినవృత్తముల సమ్మేళనముచే నీయర్థసమవృత్తము లేర్పడు నని తలంచెనే గాని యనిర్దిష్టపూర్వము లగు

నూతనవృత్తములచే నివి యేర్పడునని తలంచియుండలేదు. ఈనియమము ప్రకృతపద్యముగాక గ్రక్షిన మైనలక్ష్యములందును నిందుఁగూడ విషమపాదములందును సుస్పష్టముగ నగపడుచునేయున్నది. ఈలక్ష్యమున సమపాదములమాత్రము ముద్రితపాఠమునుబట్టి పయినియమమునకు భంగము వాటిల్లినది. గ్రంథప్రకాశకులు దీనిని గుర్తించియు సవరింప నాధారము లభింపక "ఇదియు జగతీచ్ఛందస్సులోనిదే. పొరపాటున వ్రాఁతప్రతులలోఁ బరస్థానార్ధసమవృత్తములలో నుదాహరింపఁబడి యుండును. విషమపాదములు తోదకవృత్తమునకుఁ జేరినవి." అని యీపద్యమునొద్ద వ్రాసియుండిరి.

భీమకవినియమము సురక్షిత మగుట కాధారముగ నేదేని పాఠభేదము లభించునో యనుతలంపునఁ బరిషద్గ్రంథాలయమునఁ దాళపత్త్రమాతృకలఁ బరిశీలింప నందొకదాన నీక్రిందిరీతిని భిన్నపాఠము లభించినది. (ఈప్రతి కవిజనాశ్రయముద్రణానంతరము పరిషత్తునకు సేకరింపఁబడియుండవచ్చును.)

"జననుతకీర్తి నజాయగణంబుల్, ఘనంబుగా జభసజగ వ్రజంబుతో
ననుపము లైయుభయార్థములందుణ్, బెనంగికోమలియనుపేరొడంబడుణ్"

ఈపాఠమున నిందలిసమపాదములు భీమకవిచే నిర్దిష్టపూర్వ మగురుచిరవృత్తమునకు సరిపడియుండుటంజేసి యిదియే కవిప్రయుక్తముగ నిర్ణయింపవలసియున్నది. దీనివిషమపాదములు 12 వ ఛందస్సునకును సమపాదములు 13వ ఛందస్సునకును జేరి యుండుటచే నిది పరస్థానార్ధసమ మని భీమకవి యాశయము. పాఠము భిన్నముగ నున్నను దక్షిణవ్రాఁతప్రతులలో నెల్ల నిది పరస్థానార్ధసమములలో నుదాహరింపఁ బడియుండుట గూడ నిదియే కవిప్రయుక్త మనుట కెంతయు సాధక మయి యున్నది. మఱియు భీమకవి స్వస్థానార్ధసమములకు నాల్గిటిని బరస్థానార్ధసమములకు రెంటిని నుదాహరణములఁ జూపె ననుటకంటె నొక్కొకజాతికి మూఁడేసియుదాహరణము లొసంగె ననుట యెంతయు సంభావ్యము. ఉచితము. కావునఁ బయిరీతిని ముద్రిత మగు పాఠమును సవరింపవలయు నని నాయభిప్రాయము.

ఈపాఠపరిశీలనమునందలి నాయూహలను బండితులు విమర్శింపవిన్నవించుచు నీసమావేశమునఁ గలవ్యాససంకోచనియమముచే నింతటితో విరమించుచున్నాఁడను.

---

వ్యాసకర్తగారి యభిప్రాయములను గృతజ్ఞతాపూర్వకముగఁ గైకొని ద్వితీయముద్రణకాలమున విమర్శింతుము. ప. అ.

# గ్రంథస్వీకారము.

1. శ్రీభక్తకల్పద్రుమశతకము——ఇది గుంటూరుజిల్లా సత్తెనపల్లితాలూకా బయ్యవరము గ్రామనివాసులగు బ్ర॥ భువనగిరి అమరయ్యశాస్త్రులుగారు రచియించినది. 110 పద్యములుగలవు. మొదటిపద్యముమాత్రము శార్దూలవృత్తము. తక్కినవి మత్తేభములు. 110 యవది గీతము. ఈగీతము తక్కఁ దక్కినవన్నియు నొక్కపకారప్రాసముతో రచియింపఁబడినవి. సంస్కృతపదజాలమెక్కువగను దెనుఁగుపదములు తక్కువగను జూపట్టును. కవిత్వము మృదుమధురమైనది. ధారాళధారగలది. భక్తిరసపూరితము. ఒకపద్యము మచ్చుచూడుఁడు.

మ. అవనీభారమునిర్వహింపగ సురేంద్రారాతులన్ ద్రుంపగా
రవివంశంబునబుట్టి యాజినికృతార్థప్రాభవున్ జేసి తీ
వవురా నన్ గృపనాదరింపఁగ మహాత్మా నీవెపో ధాత్రి బ
య్యవరాధీశ సురేశవంద్య రఘువర్యా భక్తకల్పద్రుమా. ౧

ఈరీతిగానుండును. అచ్చుతప్పులు వ్రాఁతపొరపాట్లు పెక్కులుగలవు. వెల రు 0-2-0. ఇక్కవిగారివి సుజ్ఞానప్రబోధిని, సీతావిజయమును, నృగమహారాజుచరిత్ర, భగవద్గీతార్థసారసంగ్రహము మొదలైన పెక్కుగ్రంథములు గలవు. శ్రీవాగ్వతీ పుస్తకవిద్యాలయములో బయ్యవరములోనే దొరకును.

---

2. శ్రీవివేకానందస్వామి జీవితము — (ప్రథమభాగము)వచనము. కర్త-బ్ర॥ శ్రీ॥ బులుసు వేంకటేశ్వరులుగారు. ముప్పదియా అధ్యాయములు. 258 పుటలు. ఇదియంతయు స్వాముల జీవితముమాత్రమె. ఇందువచనశైలి హృద్యముగను నిర్దుష్టముగనున్నది. ఇంగ్లీషులోనుండి వేంకటేశ్వరులుగారు, స్వతంత్రముగను సంగ్రహముగను దెనిఁగించి యాంగ్లము నెఱుఁగనట్టియు, మాతృభాషాభిమానులగునట్టియు నాంధ్రసోదరులకు స్వాములవారిజీవితము నెఱింగించుటయే యుద్దేశముగఁ బ్రకటించిరి, కావున నాంధ్రులు వీరిపరిశ్రమకుఁదగిన యానందమును గల్గింతురుగాక. శైలికై గ్రంథాంతమునందలి కొన్నిపంక్తులు స్వాములవారి యుద్దేశముఁ దెలుపుచున్నారము.

" నాజీవిత మొసంగవలయు సందేశ మిపుడు నాకు లభించినది. మాతృదేశసంరక్షణార్థము, సర్వప్రపంచమోక్షమునిమిత్తము పాశ్చాత్యఖండములకేగి

నేను సనాతనధర్మమందుభిని మ్రోగించెదను. లక్ష్మీసరస్వతీవరప్రసాదములచే వెల్గొందుచున్న పశ్చిమప్రపంచము, ప్రాచ్యధర్మసందేశమును గుర్తించితీరవలయురు. అప్పుడు పాశ్చాత్యులఁగాంచి ప్రాచ్యఖండము తిరిగి తన సహజాధ్యాత్మజీవనౌన్నత్యమును గమనించితీరవలెను. కావున ధర్మముకొఱకు... భారతభూమికొఱకు నేను పశ్చిమఖండముల కరిగి మాతృదేశోద్ధరణావకాశములను సంగ్రహించి సనాతనధర్మసందేశోత్కృష్టతను ప్రపంచముచే నర్పింపఁజేసెదను."

దీనివెల రు 1-8-0-కాకినాడలో- బ్ర॥ బులుసు వేంకట(శ్రీ)రామమూర్తిగారియొద్ద దొరకును.

---

3. యుద్ధకాండము—(శ్రీ)స్కాందపురాణాంతర్గత శంకరసంహితయందలి శివరహస్యఖండములోనిది. కోడూరి వేంకటాచలకవిప్రణీతము. వరంగల్ శైవప్రచారిణీగ్రంథమాల ౨౪వ పుష్పము. బ్ర॥(శ్రీ)॥ కొడిమేల రాజలింగారాధ్యులవారిచే సంపాదితమును వారిశైవప్రచారిణీ ముద్రాలయముననే ముద్రితమును రెండాశ్వాసములు. రాయల్ 76 పుటలు. సుమారు 600 పద్యములు. కవిత్వము చిన్నచిన్న సంస్కృతపదములకూర్పుతో జటిలముగానుండును. దీనివెల రు 1—4—0.

మ. దనుజేంద్రుండు నివృత్తమూర్ఛుఁడయి ప్రోద్యత్ప్రౌఢిమాయామయం
బు నిజాకారము నొందు నాక్షణమునం బుట్టించె యుద్ధాస్త్రమ
య్యనృతక్రవ్యభుజుండు వేగమ హిరణ్యాభాకృతిన్ విస్ఫుర
ద్ఘనగర్జారవముం జెలంగ నెదురంగాఁ జూచి రోషంబునన్.

ఇది మచ్చుపద్యము. ౨. అ. ౨౨౩ ప.

---

4. మిత్రలాభము, కాకోలూకీయమును. (పంచతంత్రికథాంతర్గతము.) సాహిత్యవిద్యాప్రవీణ బులుసు వేంకటరమణయ్యగారిచే రచియింపఁబడినది. సంక్షేపవచనము. 84 పుటలు. ఇందు మిత్రలాభములో 7 కథలును, కాకోలూకీయములో 17 కథలును గలవు. వచనము సలక్షణముగను మనోహరముగనున్నది. కథలు నీతిరసపూరితములు. పంచతంత్రిని మనమిపుడు క్రొత్తగాఁజూడవలసినదిలేదు. ప్రస్తుతవచనము దానినుండి వెడలినది. బాలురయుపయోగమున కిదియెంతయుం దగినది. శైలి చిత్తగింపుఁడు.

"ధర్మవిహీనుఁడు గాలిపీల్చుచు విడుచుచున్నను కమ్మరివారి తోలుతిత్తి వలెనే యుండును. కాన జీవశూన్యుఁడు. ధర్మములేనిపాండిత్యము కుక్కతోఁకవలె వ్యర్థమైనది. ధర్మవిహీనులు పశువులు.

దరిద్రుఁడగు పురుషుఁడును, పుత్రసంతానములేనికూటమియు, శ్రోత్రియుఁడు కాని తద్దినమును, దక్షిణలేనియజ్ఞమును నిష్ప్రయోజనములు.

ధనములేనివాఁడు వేసవికాలమునందలి యేఱువంటివాఁడు, అడవిఁబండిన తిలలవంటివాఁడు, దరిద్రునికోరికలు పైపైకిఁ బోయియు, తమహృదయములందే యణఁగిపోవుచున్నవి."

వెల వేయఁబడియుండ లేదు, ప్రమాదమున విడిచియుందురు. కే. శ్రీనివాసరావుగారు, శ్రీ వేదవ్యాస ముద్రాక్షరశాల. అని విజయనగరమునకు వ్రాసి తెలిసికొనుఁడు.

5. శ్రీమద్భగవద్గీత—రాజమహేంద్రవరము, హిందూసమాజమువారి ప్రచురణములలో నిది యొకటి. (సటీకాతాత్పర్యవివిధవ్యాఖ్యానవివరణము) ఉపోద్ఘాతములో "తెనుఁగుభాషలో ప్రతిపదార్థతాత్పర్యములలో నెన్నో గీతా గ్రంథము లచ్చుపడియున్నవి. కాని, యవన్నియు నేదో యొకప్రత్యేక సంప్రదాయమును బ్రకటించుటయే ముఖ్యోద్దేశముగాఁ గలవి. గీతాశ్లోకములయర్థమును నిష్పక్షపాతముగఁ బ్రకటించునవి కావు. స్వతంత్రబుద్ధిగలవా రా యర్థములపై నాధారపడి, దానిని తమ జీవితానుభవముతో సమన్వయము చేసికొని, అందువలన నాత్మాభివృద్ధినిఁ బొందుమార్గమును సూచించునవిగ లేవు. అట్టిలోపమును గొంతవఱకు నివారించుట కీగ్రంథమును ప్రత్యేకముగా ప్రకటింపసాహసించితిమి. అట్లని సంప్రదాయవ్యతిరేకముగఁ బ్రకటించుట మాయుద్యమము కాదు. భిన్న సంప్రదాయముల వ్యాఖ్యాతల యర్థవివరణములును, స్మృతులును ముఖ్య శ్లోకములు దిగువనుదహరింపఁబడినవి." అనియిట్లులిఖించిరి. ఇదియారసిన నిందుమహార్థమున్నది. లోకులసాధారణజ్ఞానమున కర్థమగునట్లును మనస్సున కెక్కునట్లును ముఖ్యవిషయవివరణములతోఁ బ్రకటింపఁబడినది. ౧౫ వ అధ్యాయము మొదటిశ్లోకములం బరిశీలించినయెడలఁ బాఠకులకు వీరిలోకోపకారకప్రయత్నము విశదము కాఁగలదు. వ్రేళ్ళుమీఁదికిని శాఖలు క్రిందికినిగల రావిచెట్టని చెప్పిన దానివివరణము బహునిపుణముగను సంక్షేపముగను వివరించిరి. అదియచాలును. భగవద్గీతలను నేర్చికొనుటకు నిది యెల్లవారికి సత్సహాయము చేయును. చదు

పుటకుఁ బ్రోత్సాహముచేయును. గీతలనిన బ్రహ్మాండమైన దని బ్రహ్మవిద్య యని భయపడవలదు. గీతలవిషయమై గాంధిమహాత్ముఁ డేమిచెప్పియున్నారో వినుఁడు. "గీతాగ్రంథములోని సంస్కృతభాష అతిసులభమైనది. మీలోసంస్కృతము తెలిసినవారు రేపో, రేపననేల నేఁడే యొక గీతలప్రతి కొని దానిని చదువ నారంభింపవలెను. ఎవరంతటవారు గీతాపఠనము ప్రారంభింపవలెను... మీకు సంస్కృతము రానియెడల ప్రత్యేకము గీతలను చదువుటకైన నాభాషనేర్చుకొనవలెను." అని-మీరిపుడు క్రొత్తగా శ్రమపడి నేర్చుకొననక్కఱలేదు. తెనుఁగుననన్వాదులతో నిట్టి చక్కనిపుస్తకము బైలువెడలి చాలభాగము శ్రమను తగ్గించుచున్నది. కావున నాంధ్రులెల్లరు నీగీతనుదెప్పించిచదివి శుద్ధహృదయులయ్యెదరుగాక. వెల మంచిబైండు రు 2-0-0 అట్టబైండు రు 1 8-0.

6. పరిక్షిత్తు—(నారాశంసి) గ్రంథకర్త బ్రహ్మశ్రీ పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు, పిఠాపురము. పరిక్షిన్నరేంద్రుని చరిత్ర మిది. పరిక్షిత్తుజననము మొదలు మరణాంతమున జనమేజయుని పట్టాభిషేకమువఱకును గలదు. గ్రంథకర్త పీఠికలో నిట్లు వక్కాణించిరి.

"ఇరువదేండ్లనుండి కళాశాలలోను, జాతీయకళాశాలలోను, నున్నతపాఠశాలలోను, సంస్కృతాంధ్రభాషల కుపాధ్యాయుఁడుగానుండి బాలురమనస్తత్త్వముల గుర్తెఱిఁగి యీగ్రంథము ననుభవపూర్వకముగ వ్రాసితిని. బాలురకు భాషతోఁగూడఁ బ్రాచీనచరిత్ర, స్వసాంఘికమతాచారములు, దైవభక్తి కూడ మిగుల నేర్పుట యావశ్యకమై యున్నది. మఱియు భారతీయులకుఁ బరమప్రమాణము లగు వేదములలోని యంశములు కూడ బోధించుట ముఖ్యతమము. ఇపుడు విద్యార్థి భవిష్యత్తున గృహస్థుఁడు కాఁగలఁడు. అతఁడు గృహస్థాశ్రమస్వీకారము నొందునపు డెట్లుప్రవర్తింపఁగలవాఁడో తెలిసికొనుట యత్యవసరము.'' అని వ్రాసియున్నారు. కావున బీజప్రాయముగ విద్యార్థులకుఁ బై యన్నివిషయములు దీనిం జదివినఁ దేటపడఁగలవు. కొంతభాగము శైలికై చూపెదము.

"*త్రిగర్తాధీశుఁ డగు సుశర్మ కురుక్షేత్రసంగ్రామమునఁ బదునెనిమిది దినములు... ఘోరముగఁ బోరి యర్జునునిచేతనే మృతినొందెను. శ్రీకృష్ణునంతటి మహానుభావునిగూడఁ సంశప్తకులచే నర్జునుఁ డేమయ్యెనో యని కంటనీరువెట్టునట్లు చేయఁగలిగిన త్రిగర్తదేశీయు లశ్వముతో నర్జునుఁ డేతెంచె

నని విని యూరకుందురా? తమ పితృభ్రాత్రాదు లర్జునునిచేఁ జచ్చినపగను మఱతురా" అశ్వమును బంధించి ఘోరసమరమునకుఁ గడఁగిరి.

* త్రిగర్తదేశము రాజపుత్రస్థానములో కొంతభాగము. త్రి + గర్త = గర్తమన గొయ్యి. సాంబరు, నరు, డిడ్వానా యను సరస్సులుగల ప్రదేశమే యీత్రిగర్తదేశముకావచ్చును-" అని.

(ఇచ్చట గర్తమన (గొయ్యికాదు) గుంట యనుట లెస్స. గుంట- కోనేరు సరస్సు మొదలగునవి యగును. దీనివెల రు ౦-౧౨-౦.

---

7. ఆంధ్రాక్షరములు:—శ్రీరాజా పానగంటి పార్థసారథిరాయణింగారు. బి. ఏ. గారిచే రచింపఁబడినది. తెలుఁగుభాషయొక్క లిపి పెక్కువిధముల సంస్కరణము కావలయు ననియుఁ గొన్ని నూతనాక్షరములఁ జేర్చియుఁ గొన్నిటిని వదలివైచియు లిపిని సంస్కరింపవలెననియు గ్రంథకర్తయభిప్రాయము. ఆంగ్లాదిభాషలయందలి స్వరముల కనుగుణముగ మనము భాషను మార్చవలెనఁట. ఇందు గుణితముకూడ మాఱుచున్నది. ఈనూతనలిపియం దచ్చులు ౧౮ హల్లులు ౪౬. తాటాకు, ఇత్యాదిపదముల యుచ్చారణము ననుసరించి నూతనస్వరములు కల్పింపఁబడినవి. ఇట నొకవిషయము. ఆంగ్లభాషయందుఁ గూడ నుచ్చారణము ననుసరించి లిపి సంస్కరింపఁబడలేదు. మనభాషయం దొక్కయక్షరముచేతనే వివరింపఁబడు ధ్వని యటఁ బెక్కులక్షరముల కలయికచేఁ గలుగుచున్నది. అందును నక్షరము లుచ్చారణమున భేదము నొందుటచే వానికి సాంకేతికములు గలవు. ఇటులనే యితరభాషలయొక్క లిపికిని నుచ్చారణమునకును వ్యత్యాసము గలదు. ముద్రణ సౌకర్యార్థ మీగ్రంథమున స్వరవ్యంజనాదులు సమ్మేళనముఁ బొందక, వేరుగ నిరూపింపఁబడినవి. అక్షరములయొక్క మూలస్వరూపములకు స్వరసాంకేతికము లుంపఁబడినవి. టైపుయంత్రమున కనుకూల మగునటుల లిపిని సంస్కరింపవలె నని పలువురు ప్రయత్నించుచున్నారు. అది లిపియొక్క సౌష్ఠవమునకు సహకారి యగునా యను విషయము విమర్శకు లాలోచింపవలసియున్నది. ఈ నూతనవిషయము నాలోచించి తమకుఁ దోఁచిన మార్పులను గ్రంథకర్తగారీగ్రంథమునం జూపియున్నారు. "అపరితోషా ద్విదుషాం న సాధుమన్యే ప్రయోగవిజ్ఞాన"మ్మని గ్రంథమ్మును ముగించినారు. వలయువారు గ్రంథకర్తగారికి వ్రాయవలయును.

8. పురాతనసాంఘికపరిస్థితులు—శ్రీమార్కికొంబి రంగాచార్యులు వారు రచించినది. ఇందు వీరు పురాతనకాలములోని సాంఘికమతపరిస్థితులను బహుపురాతనగ్రంథపరిశీలనమున శ్రమసాధ్యమైనవిషయములను సమకూర్చిరి. పూర్వముబ్రాహ్మణులగౌరవాదికము, క్షత్త్రియులయాధిపత్యము, బౌద్ధమతప్రచారము, జాతకకథలలోనివిషయములు, నిందుఁదెల్పఁబడినవి. ఒక్కటేమి పురాతనవిషయము లసంఖ్యాకము లిందుఁగలవు. చదువఁదగినది. విషయమవశ్యమును గ్రహింపఁదగినదియును. పూర్వము హిందువులలో నున్నవర్ణములంగూర్చి పాశ్చాత్యవిద్వాంసులలో సర్ హెూజిన్ ఇబ్బెట్‌సను, సెనా, నెస్ఫీల్డు, రిస్లీ మొదలగువారు గావించిన సిద్ధాంతము లిందుఁ గలవు. అంబట్ఠసుత్తము, వాసెట్ఠసుత్తము, అస్సలాయనసుత్తము, మధురసుత్తము మొదలగుపాళీభాషలోని వర్ణసంబంధసూత్రములు కొన్ని యిందుఁ దెల్పఁబడినవి. పూర్వపుమన్వాదిధర్మశాస్త్రములు, జాతకగ్రంథములు- మొదలగువానియందుఁ జెప్పఁబడిన విషయములే కాని నూతనవర్ణసిద్ధాంతములు గాని వర్ణచారిత్రముకాని యిందు లేదు. శైలికిని విషయమునకును గొన్నిపంక్తులు—

"దేశములో బౌద్ధమతము వ్యాపించినతరువాతను దత్పూర్వమునవలె వర్ణములు సుస్థిరములై యుండి బుద్ధుఁడవతారము త్తినపిదపనైనము సంఘనిర్మాణమేమి యు మార్పుఁజెందకయే యుండెను. అతిపురాతనపాళీవైదికగ్రంథములలో విభాగానుసంధానంబులను గనుచున్నారము. ఇంతియ కాక నవీనములగు జాతకవ్యాఖ్యానములలో సైతము దేశమున బౌద్ధమతము ప్రబలియుండి మోక్షసంపాదనములో వర్ణము నిష్ప్రయోజనమను బౌద్ధసిద్ధాంతము ప్రజలయంగీకారమును బడసినపిదపను, వర్ణవిభాగముల బలము క్షీణింపక యెప్పటివలెనె యుండెను"- 36 పుట.

దీనికి వెల వేయఁబడి యుండలేదు. ఈరంగాచార్యులువారివి బృహస్పతి అర్థశాస్త్రము, బుద్ధఘోషునిజీవితచారిత్రము. జాతకకథలు 1-2 భాగములుం గలవు. విజయనగరము గ్రంథకర్తగారిపేర వ్రాసి తెప్పించుకొనవచ్చును.

---

విధము లై, గృహ్యతే=గ్రహింపఁబడును. దీని తాత్పర్యము, యరలవలు నాలుగును ద్వివిధములు. అందులో యవలకు "హలి సర్వేషాం" అనుసూత్రమునందు, పాణినీయములో లఘువులును, అలఘువులును నని రెండువిధములును సూచితము లయ్యెను. లకారము "లో ళః" అనుసూత్రమునందు ప్రాకృతవ్యాకరణములో రెండువిధము లాయెను. పరిశేషించిన రవర్ణము, ఆంధ్రవ్యాకరణములో ద్వివిధ మవుననుట.

---

అద్యః క్రియాసు భూతార్థోద్యోతిత* మాద్యగం వినా సర్వః
యశ్రుతి మార్యా లఘుయం ప్రవదన్తి ప్రాణతః పరం ప్రాణమ్. ౮

ఇది రెండుసూత్రములు. క్రియాసు=క్రియాపదములయందు, భూతార్థోద్యోతితం=భూతార్థములం గనిపించునవి యు, ఆద్యగం=నామాది నుండునవి యు, వినా=వినాగాను, సర్వః=సమస్త మైన, యః=యకారమును, అత్=అకారము. అకారమనఁగాఁ దలకట్టనుట. చనియె, వినియె మొదలైనవి క్రియాభూతార్థస్థితయెకారములు. యెమ్మె, యెప్పుడు, మొద లైనవి నామాదినున్న యెకారములు. ఈరెండును విడిచిపెట్టి కడమ యకారములెల్లఁ దలకట్టుగాఁ దెలియునది. ప్రాణతః=అచ్చుకంటెఁ బరమైన, ప్రాణం=అచ్చును, యశ్రుతిం=యకారముగా వినఁబడుదానిని, లఘుయం=లఘుయకారముగాను, ఆర్యాః=పెద్దలు, ప్రవదన్తి=పలుకుదురు. హరియధికుండు, మాయేలిక, మొదలైనవి లఘుయకారములు.

---

నాన్యేషాం వైధర్మ్యం లఘ్వలఘూనాం రయోస్తు నిత్యం స్యాత్
అర్ధస్య స్తాలవ్యశ్చ రవక్రస్యా స్థిథ స్సవర్ణశ్చ. ౯

ఇది మూఁడుసూత్రములు. లఘ్వలఘూనాం=లఘ్వలఘువు లైన, అన్యేషాం=కడమవానికి, వైధర్మ్యం=విరోధము, న=లేదు, రయోస్తు=లఘ్వలఘువులైన రవర్ణములకైన, నిత్యం స్యాత్=నిత్యముగా విరోధము గలదు. విరోధ మనఁగాఁ దమలో యతిప్రాసములు చెల్లకుండుట- ఇటనంగా యవలు ద్వివిధములును వెలుఁగునఁ గల వనుట. అచ్చుమీఁదను అచ్చునకు వచ్చినయకారము లఘుయకారము. ప్రథమాంతముమీఁద, పకారమునకు వచ్చిన యా

* భూతార్థద్యోతినం-పా.

దేశవకారము లఘువకారము. లళలు ప్రసిద్ధములేను. వీనికి యథోచితముగా నుదాహరణములు:—

నీళ్లఁబాలునుగలసినట్లెల్లప్రొద్దు, నాయహోవిభూషణుఁడునీవుఁబాయకుండు
రనుచుఁజెలికత్తెపలుకహిమాచలాత్మ,భవ ముఖాబ్జంబువంచిసిగ్గువడియుండె.

కొందఱు ద్వివిధములైన వకారములకును, తొల్లి మైత్రి లే దందురు. ఇంక రవర్ణోదాహరణము:—

ఱెక్కలుగలట్టి పెనుబాఁపఱేఁడ్లవంటి, కఱకుములుకులశుంభునుక్కఱఁగఁజేసి
పరమకళ్యాణి గిరికులేశ్వరతనూజ, రణవినోదంబు సలిపె నిర్జరులు వొగడ.

దన్త్యాః=దంత్య మైన, చుః=చవర్గము, అత్=అకారము, తాలవ్యః=తాలవ్య మైన, చుః=చవర్గము, వక్రః=ఎకారము, స్యాత్=అవును, మిథః సవర్ణశ్చ=దంత్యతాలవ్యములు రెండును, దమలోఁదాము, సవర్ణము లవును. చందురుఁడు, చక్కెర, జాడ, జంట మొదలైన దంత్యములు తలకట్లనుట. చెన్ను, చెల్వు, జెట్టి, జెఱ్ఱి, ఇవి మొదలైన తాలవ్యము లెత్వము లనుట- ఇందుకు దాహరణము:—

చక్కఁదనము లోకజయవైభవము వల,రాచవారువడసి రాచరించి
చెలువ నద్రికన్య సేవించువారికి, జాడఁగన్గొనఁగ నసాధ్యమెద్ది.*

---

ప్రాతిపదికం హి నామ ప్రత్యయ ఇహ వర్ణకః క్రియా ధాతుః
ప్రాణా స్సమాసతోఽచో బిన్దు రనుస్వార ఏజథో వక్రః. ౧౦

ఇవి యాజుసూత్రములు. ప్రాతిపదికం=శబ్దశాస్త్రప్రసిద్ధ మైన ప్రాతిపదికము, నామ=నామ మనంబడును. ఇహ=ఈయాంధ్రవ్యాకరణమందు, ప్రత్యయః=ప్రత్యయము, వర్ణకః=వర్ణక మనంబడును, ధాతుః=ధాతువు, క్రియా=క్రియ యనంబడును, అచః=అచ్చులు, సమాసతః=సంగ్రహముచేత, ప్రాణాః=ప్రాణము లనంబడును, అనుస్వారః=అనుస్వారము, బిన్దుః=బిందువనంబడును, ఏజ్=ఏఓలు, వక్రః=వక్రము లనంబడును.

---

వక్రతమఐ జ్ఝలస్యు స్సమాసతః ప్రాణినో ద్రుతాఖ్యో నః
కచటతపాః పరుషాఖ్యా గజడదబాస్తు సరళాః స్థిరా ఇతరే. ౧౧

ఇవి యాజుసూత్రములు. ఐచ్=ఐఔలు రెండును, వక్రతమః=

---

* గలుగుశుభములెల్ల సళుకులేక-పా.

వక్రతమము లనంబడును, హాలః=హల్లులు, సమాసతః=సంగ్రహముచేతను, ప్రాణినః=ప్రాణు లనుపేరు గలవి, స్యుః=అవును, నః=నకారము, ద్రుతాఖ్యః= ద్రుత మను పేరుగలది, కచటతపాః=ఈదైదును, పరుషాఖ్యాః=పరుషము లను పేరుగలవి, గజడదబాః=ఈదైదును, సరళాః=సరళము లనంబడును, ఇతరే= పరుషసరళములు పదియు వినాగాను గడమహల్లు లన్నియు, స్థిరాః=స్థిరములనఁ బడును.

ఇన్ద్రాద్యా అపిచ గణా వళిరాద్య మన్త్యరాక్షరం ప్రాసః
న పదా న్యవ్యయ సుప్తిఙ్ క్త్వా తుమునా మనుకృతేస్తి వాక్యంతు. ౧౨

ఇది నాలుగుసూత్రములు. గణాః=గణములు, ఇన్ద్రాద్యాః అపిచ= ఇంద్రచంద్రసూర్య లనునవియుఁ గలవు, ఆద్యం=మొదటియక్షరము, వళిః= వళి యనంబడును, అన్త్యరాక్షరం=రెండవయక్షరము, ప్రాసః= ప్రాస మనం బడును, అవ్యయసుప్తిఙ్ క్త్వాతుమునాం=అవ్యయమునకును, సుబంతమునకు ను, తిఙంతమునకును, క్త్వా ప్రత్యయాంతమునకును, తుమున్ ప్రత్యయాంతమున కును, పదాని=ప్రయోగపదములు, న=లేవు, అనుకృతేతు=అనుకరించు చో టులనైన, వాక్యం=వాక్యము, అస్తి=కలదు. వాక్యశబ్దము పదమునకు ను పలక్షణము. దీనితాత్పర్యము-ప్రాంతః, అంతః, హరిణా, రామేణ, భవతి, అస్తి, కృత్వా, గంతుం, రంతుం, అను ప్రయోగములు తెనుఁగున లేవు. ఇవే యనుకరించి ప్రయోగించినఁ గలవు. అనుకరించున దనంగా, పద ముచ్చరించి తుదను "అని" అనుమాట ప్రయోగించునది. సాయం అని, హరిణా అని, కృత్వా అని, అనునవి యనుకారములు. ఈయవ్యయాదులైన యయిదింటికి, ననుకారములచేతఁ బ్రయోగమునకు నుదాహరణము చెప్పుచున్నాఁడు.

శా. మాత స్తే సతతం నమో యనుచు, నంబ త్వాం భజే యంచు, వం
దే తే పాదసరోజ మంచుఁ, బురతః స్థిత్వా మమ త్రాహి యం
చాతంకాన్ కుశలాసి హర్తు మనుచున్, హర్షంబుతోఁ బల్కుచున్
ఖ్యాత శ్రీపురుషార్థము ల్వడసెదం గా నేను గాత్యాయనీ.

---

తిఙ్షష్ఠ్యశేషషష్ఠీసుప్స్వర్గ్యప్రవచనీయజవిభక్తేః
కిశ్చిత్రప్రశంసనాద్భుతసన్తాపయదాతదాకిమేవాంశ్చ. ౧౩
క్త్వాకిలతూష్ణీ మాద్యా నభిదధతి కలా ద్రుతో న యేషాం స్యాత్
అన్యే ద్రుతప్రకృతయో యే స్యు ర్వ్యానుజీవితద్రుతా నిత్యమ్. ౧౪

ఈయార్యాయుగళము రెండుసూత్రములు. తిఙర్థ్యా=తిఙర్థ్యము ల ను క్రియలును- ప్రబలితివి, సంతోషించితివి, ప్రకాశించిరి, సంతోషించితిమి- ఇత్యాదిక్రియలు తిఙర్థ్య లనిపించుకొనును. శేషషష్ఠీ=యొక్కషష్ఠియు, హరి యొక్క, గిరియొక్క అనుషష్ఠియును, సుస్=వనము, పవనములు, ఇత్యాది ప్రథ మావిభక్తియును, కర్మప్రవచనీయజవిభక్తిః=రాముంగూర్చి, కృష్ణుంగూర్చి, ఇ త్యాదిద్వితీయ యు, కించిత్=ఇంచుకంత, కాసంత, సుంత, మొద లైన కించి దర్థములును, ప్రశంసన= బళి, మజ్జా మొదలైన ప్రశంసార్థములును, అద్భు త=అహో, ఓహో, ఔరా, మొదలైన అద్భుతార్థములును, సన్తాప=అక్కట, అయ్యో మొద లైన సంతాపార్థములును, యదా తదా=ఎప్పుడు, అప్పుడు, అనెడివియు, కిం=ఏమి యనునదియు, ఏవాంశ్చ =నిన్నే, నన్నే, అను నేవార్థ ములును, క్త్వా=ప్రకాశించి, హరించి, విహరించి, ఇత్యాది క్త్వాప్రత్యయాంత ములును, కిల= చేసి నట, అనెడి కిలార్థమును, తూష్ణీం =ఊరక, మిన్నక మొద లైన తూష్ణీమర్థములును, ఆదిశబ్దముచేత, షష్ఠి యనువిభక్తియు మఱి, సుమ్ము, కద, మొద లైనవియును, కలాః=కళ లని, అభిదధతి=చెప్పుదురు, ఏ షాం=ఏవీనికైన, ద్రుతః=పైనకారము, నస్యాత్ =లేదు. కూర్చిరి కీర్తి, హరియొక్క చరణములు, శివుఁడు కర్త, ఇత్యాది. వించున్నాము, ఘటింపంగలఁడు, చనఁడు, అనెడివి తిఙర్థ్యములు గా కున్నను, ప్రథమాసమానములు గనుక సుస్సులోని వే గానే తెలియునది. సుస్ అంటే ప్రాకృతశాస్త్రవ్యవహారమునఁ బ్రథమా విభక్తికిఁ బేరు. ఊరక, చేయక, అనునవి క్త్వా ప్రత్యయార్థము లేను. మఱియుఁ గ్రాఁ బెనుఁగున నేమైనా అంటే, ఆదిశబ్దము ఉన్నది గనుక కళాప్రదేశములుగాఁ దెలియునది. అన్యే=ఈచెప్పినవానికంటె నన్య మైనవి యేవి గలవో యువి య న్నియు, ద్రుతప్రకృతయః =ద్రుతప్రకృతు లనంబడును, యే=ఏవైన నేమి, నిత్యం=నిత్యమును, అనుజీవిత=అనుసరించుచున్న, ద్రుతాః=నకారముగలవి, స్యుః= అవును. సూత్రప్రాప్తులచేత లోపాదులు వచ్చిన వచ్చును గాని పోల్లు నకారముతోఁగూడ నుండున వనుట.

---

తజ్జా సమాచ దేశ్యా గ్రామ్యా చేయం చతుర్విధా భవతి

ప్రకృతిద్వయజా తజ్జా తుల్యాతు సమా ప్రవాహినీ దేశ్యా. ౧౫

ఇది యేకసూత్రము. ఇయం=ఈభాష, తజ్జా=తద్భవము, సమా= తత్సమము, దేశ్యా=దేశ్యము, గ్రామ్యాచ=గ్రామ్యము నని, చతుర్విధా=నాలు గువిధములుగలది, భవతి=అవుచున్నది, ప్రకృతిద్వయజా=సంస్కృతప్రాకృతము

లం బుట్టిన, తజ్జా=తద్భవము, తుల్యాతు=సంస్కృతప్రాకృతతుల్యమైన, సమా=తత్సమము, ప్రవాహినీ=లోకవ్యవహార(ప్రవాహ)సిద్ధమైనది, దేశ్యా=దేశీయము. "అనియమా ద్గ్రామ్యం" అని మొదలం జెప్పినాఁడు గనుక వర్ణన్యూనాధికతాన్యాద్యతిత దుష్టమైనదే గ్రామ్యమని వాగనుశాసనులు తల్లక్షణముం జెప్పిరి.

---

విరళాః పేచోషాదికశబ్దాః ప్రవ్యాహరంతు* శబ్దజ్ఞాః
ఇహతు ప్రవ్యాహార్యం సత్కైతసుప్రసిద్ధ మేవ పదమ్. ౧౬

ఇది యేకసూత్రము. శబ్దజ్ఞాః=శాబ్దికులు, విరళాః=అప్రసిద్ధము లైన, పేచోషాదికశబ్దాః=పేచ ఊష మొదలైన శబ్దములను, ప్రవ్యాహరంతు=ప్రయోగింతురుగాక, ఇహతు=ఇం దయిన, సత్కైతసుప్రసిద్ధం=కవిసమయసిద్ధమై ప్రసిద్ధమైనటువంటి, పదమేవ=పదమే, ప్రవ్యాహార్యం=ప్రయోగింపందగును. పేచ అనఁగా 'డుపచిష్పాకే' అనుధాతువునకు లిణ్మధ్యమపురుషబహువచనము. ఊష అనునది 'వసనివాసే' అను ధాతులిణ్మధ్యమబహువచనము. ఇవి మొదలైన శబ్దము లప్రయుక్తము లని నిషేధించియును వేదములలోఁ బ్రయోగించియున్నవి గనుక యప్రయుక్తములు గావని మహాభాష్యములో, "అస్త్యప్రయుక్తః"అనువార్తికమునొద్ద భాష్యకారులు, అన్నారు గనుక, అప్రసిద్ధము లైనను సంస్కృతములో నైనఁ బ్రయోగింపవచ్చును గాని యిం దప్రసిద్ధములు ప్రయోగింప వల దనుట. ఇ ట్లన్నందుచేతఁ బ్రయోగసిద్ధ మయిన దైన గ్రామ్యమైనను యోగ్యమే యని వాగనుశాసనులు వివక్షించినారు.

---

శా. బ్రహ్మారణ్యకమాండుకాద్యుపనిషత్పద్మాటవీహంస యా
బ్రహ్మస్తంబచరాచరప్రకరయంత్రన్యాసవిక్షేపకా†
జిహ్వాద్భవణ‡సూత్రధారపిసితాసిప్రాతభీతామరా
బ్రహ్మాణ్యాసహమానమానసపరబ్రహ్మస్వరూపాకృతీ.

ఇది శ్రీసకలభాషావాగనుశాసననన్నయభట్టవిరచితాంధ్రశబ్దచిన్తామణియందు సకలకవితాస్వతంత్రభట్టారక మెలకూచి బాలసరస్వతికవిమహోపాధ్యాయప్రణీతం బైనయాంధ్రశబ్దచింతామణి టీకాగ్రంథమునందుఁ బ్రథమమైన సంజ్ఞాపరిచ్ఛేదము.

---

* ప్రత్యాహార్యం అని రెండు ప్రతులలోను గలదు.
† విక్షేపణా. ‡ జిహ్వాక్రీడన. పా.

# సన్ధిపరిచ్ఛేదము.

సన్ధి ర్నా చో చ్యనుతో వా తోనాదిషు విభక్తి షూతో వా
నిత్య మనుత్తమపురుషక్రియా స్వితః పరిమితౌ సమస్తానామ్. ౧

ఇది యయిదుసూత్రములు. సన్ధిః న అచః అచి అనుతః- అనుతః=ఉకార వ్యతిరిక్త మైన, అచః=అచ్చునకు, అచి=అచ్చు పరమగుచుండఁగా, సన్ధిః=సంధి, న=లేదు. ఉదా. మేనయత్త, చిన్నియన్న, వన్నెయొప్పె, రోయీవి, మైయొప్పు. ఉకారమునకు సంధి కలదు. ఇంపు + అగు నని యుండిన సంధి, ఇంపగు, సొంపగు; వా అతః- అతః=అకారమునకు, వా=వికల్పమున సంధి వచ్చును. వికల్ప మనఁగా రాను వచ్చును, రాకయు నుండును; అకారమునకుఁ బూర్వసూత్రమున సామాన్యాకారముచేత సంధిరాకపోఁగా వికల్పించినాఁడు. తెన్నయగు, తెన్నగు; ఎల్లయపుడు, ఎల్లపుడు. అనాదిషు విభక్తిషు ఉతః వా- అనాదిషు=ప్రథమావ్యతిరిక్తమైన, విభక్తిషు=విభక్తులయందు, ఉతః=ఉకారమునకు, వా=వికల్పమున సంధి గలదు. మన్ననేలు, మాకొఅకునిచ్చు, నీకునారోగ్యము, కీర్తియందునురక్తి, ద్రుతప్రకృతులు గనుక నకారము నిలిచినది. మన్నేలు నిత్యాది. ప్రథమయం దైన- హరుఁ డధికుండు, హరిహగు లాద్యులు, సంధివచ్చెను. ద్రుత ప్రకృతి కాదు గనుక నకారము లేదు. నిత్య మనుత్తమపురుష క్రియాసు ఇతః- అనుత్తమపురుష=ఉత్తమపురుషవ్యతిరిక్త మయిన, క్రియాసు=క్రియలయందలి, ఇతః=ఇకారమునకు, నిత్యం=నిత్యముగా సంధి గలదు. చనిరసురులు, ప్రోచిరమరులు. ఉత్తమపురుష మైన, కొలిచితి నంబను, విడిచితి మన్యులను, అన్నది కిమాది గనుక క్రియాగ్రహణమున నంట లేదు. నిత్యం అన్నాఁడు గనుక క్రియాగ్రహణ మనిత్యము. పరిమితౌ సమస్తానాం- పరిమితౌ=పరిమాణార్థము పరమై యుండిన, సమస్తానాం=అన్ని యచ్చులకు సంధి గలదు. బారెండు, పుట్టెండు, తూమెండు, వీసెఁడు, ఇత్యాది.

---

న స్యా త్తద్ధర్మోత శ్చే ర్వా స్యా ద్వర్తమానవిహితస్య
తద్వ త్తదాదిజస్య స్యాయస్తు స్యా త్తిమాదిక స్యేతః. ౨

ఇది నాలుగు సూత్రములు. తద్ధర్మోతః-తద్ధర్మ=క్రియలయొక్క తద్ధర్మార్థ మందలి, ఉతః=ఉకారమునకు, నస్యాత్=సంధి లేదు. రక్షించునంబ, పోషించునీశ్వరి, వర్తమానవిహితస్య=వర్తమానార్థమందు చేయంబడ్డ, చోః=చువర్ణమునకు, వా స్యాత్=వికల్పమున సంధివచ్చును. నగుచిట్లనియె, నగుచు

నిట్లనియె, తదాదిజస్య=తచ్ఛబ్దాద్యర్థములయందుఁ బుట్టిన ఇకారమునకు, తద్వత్ = చూకు (చుకారమునకు) వలెనే వికల్పము (సంధి వచ్చును) అదియె వ్వరు; అదెవ్వరు, ఇది యేమి, ఇదేమి; కిమాదికిస్య=కిమర్థాదులయొక్క, ఇతస్తు=ఇకారమునకైన, ప్రాయః=తఱచుగా, స్యాత్=సంధికలదు. ఏమమ్మ, ఏమయ్య, ఏమందు. ప్రాయః అన్నాఁడు, గనుక యేమియన్న యనియును గలదు.

---

అపిశబ్దార్థస్యేత శ్చేరే రుపధాత్మనశ్చ లు గ్వా స్యాత్
శత్రర్థేతూతశ్చేనో స్తస్య స్యాచ్చ పూర్ణబిన్దు రపి. 3

ఇది మూఁడుసూత్రములు. అపిశబ్దార్థస్య ఇతః- అపిశబ్దార్థస్య=అపి యను నుపసర్గార్థపదముయొక్క, ఇతః=ఇకారమునకు, వికల్పమున లోపము వచ్చును, హరునే నంబనే, హరునేని నంబనేని. చౌ రుపధాత్మనశ్చ లు గ్వా స్యాత్. కొనయక్షరమున కీతలనుండెడిది ఉపధ, ఉపధాత్మనః=ఉపధారూపమైన, రేః= రి అను నక్షరమునకు (రివర్ణసంబంధియైన యికారమునకు) చౌ=చి యనున క్షరము పర మగుచుండఁగా- లుక్ వా స్యాత్=ఇకారమునకు వికల్పమున లోపము వచ్చును. అమర్చి, అమరిచి. శత్రర్థేతూతశ్చేనోః- శత్రర్థే=పర్తమానార్థమందు, చౌ = చువర్ణము పరమై యుండినచో, నోః = నుకారముయొక్క, ఉతః=ఉకారమునకు, వికల్పమున లోపము వచ్చును. తస్య=మిగిలిన యానకారమునకు, పూర్ణబిందు రపి=నెఱబిందువును, స్యాత్=అగును. వినుచు, వించు; అనుచు, అంచు. 'బిందు రపి' యని యపిశబ్దము పెట్టినందుచేతఁ గొన్నిచోటుల రాదు. చనుచు, ఎన్నుచు, పూనుచు, ఇత్యాది.

---

శబ్దా త్తచ్ఛబ్దాతః పోశ్చ తదాద్యర్థవాచకే షూతః
ప్రథమావైభక్తికమో ర్బిందుశ్చ మహాః పతిక్రియా ర్థేతు. ౪

శబ్దాత్ తచ్ఛబ్దాతః=శబ్దమువీఁద నుండు తచ్ఛబ్దార్థము యొక్క, అకారమునకు వికల్పమున లోపము వచ్చును. బాఁపనది, కోమటిది. బాఁపనయది, కోమటియది. తదాద్యర్థవాచకేషు=తదా యనెడిమొదలైన శబ్దార్థములు పలికెడువానియందలి, పోః=పు అనునక్షరముయొక్క, ఉతః=ఉకా మునకు, వికల్పమున లోపము వచ్చును, అపుడు, అప్డు; ఇపుడు, ఇప్డు, ఇత్యాది.

పఙ్త్రి గతౌ అను ధాత్వర్థము పరమైన- ప్రథమావైభక్తిక=ప్రథమావిభక్తి రూప మైన, మో=ము అను నక్షరమునకు వికల్పమున లోపము, మహాంశ్చ బిందుశ్చ=లోపము రానిచోట పూర్ణబిందువును- భయపడి, భయంపడి; సంకటపడి, సంకటంపడి. ఇత్యాది.

---

షష్ఠ్యా ఉతో చి ను మ్సేచాద్య స్యామ్రేడితే స్త్యలోపశ్చ
అహమాదీనాం ద్విత్వం లోపో నమఆదికే విసర్గస్య. ౫

ఇది నాలుగు సూత్రములు. షష్ఠ్యాః ఉతః అచి నుమ్ సే-ప్రాకృతశాస్త్రవ్యవహారమున స అనిన సమాసము. సే=సమాసమందు, ఉతః=ఉకారముయొక్క, షష్ఠ్యాః=షష్ఠికి, అచి=అచ్చుపరమై యుండిన, నుమ్=నుమ్ అను నాగమము వచ్చును. ఆగమాదేశాదిలక్షణములు శబ్దశాస్త్రవ్యవహారముననే తెలియునది. "అనుక్త మన్యవత్" అనుప్రాకృతన్యాయమున నుమ్లోని ఉకార మకారములకు శబ్దసూత్రముచేత లోపము చేయునది. రాజునెదుట, పామునెమ్మలు. ఆద్యస్య ఆమ్రేడితే అంత్యలోపశ్చ, ఆమ్రేడిత మనఁగా రెండు మాఱులుచ్చరింపఁబడు శబ్దము. దానియందు, ఆద్యస్య=మొదటిదానికి, అంత్యలోపః=అంత్యలోప మౌను. అన్నన్న, ఏమేమి, ఓహోహో, ఇత్యాది. అహమాదీనాం=అహం మొదలైనవి, యనుకరించునప్పుడు వాని యంత్యమునకు, ద్విత్వం=ద్విత్వము వచ్చును. సున్నకు ద్విత్వము రానేరదు గనుక మకారము చేసికొనునది. అహమ్మని, కిమ్మని, ఝుమ్మని. లోపః నమ ఆదికే విసర్గస్య, నమ ఆదికే=నమః అనునవి మొదలైనవి యనుకరించునప్పుడు వానియందలి, విసర్గస్య=విసర్గకు, లోపః=లోప మౌను. నమోనమ యని, ధర్మస్సహాయ యని.

---

పరుషా ద్రుతప్రకృతికా త్సరళా స్స్యు స్తద్ద్రుతంచ బిందుస్స్యాత్
అవికారగతే తస్మి న్నపి సరళా ఏవ సన్తి తే పరతః. ౬

ఇది రెండు సూత్రములు. ద్రుతప్రకృతికాత్=ద్రుతప్రకృతిమీఁద నున్న, పరుషాః=కచటతపలు, సరళాః స్యుః=గజడదబ లౌను. తద్ద్రుతంచ=ఆద్రుతప్రకృతియొక్క నకారము, బిందుః స్యాత్=సున్న యౌను. నినుఁదలంతు, ననుఁగావు. హ్రస్వపరము గనుక పూర్ణమును నౌను. నినుందలంతు, ననుంగావు. దీర్ఘపర మైన లేవు, నేఁగొలిచితి, తాఁగొను. తస్మిన్=ఆనకారము, అవికారగతేపి=బింద్వాదిరూపము గాకపోయినను, స్వభావమున మున్నునుగానీ, పరతః=

మ. స్మరజిద్భక్తిరసాంబుపూరితము (శ్రీ)మస్నానసావాలమం
దురహీ స్నీపదపల్లవాంకురము సంతోషంబుతో నిల్పి సు
స్థిరముం జేసిన దాన ముక్తిఫల మర్థిం గాంతు రానేర్పు చూ
పరు లెంచ న్బెడనాభిధానశివపూర్వస్వాద్యగస్త్యేశ్వరా. ౧౬

మ. నరులుం గిన్నరులు న్మునీశ్వరులు నానానిర్జరు ల్గాడినం
దిరుగంబాఱునె లోకసంతతియు, సాధింపంగ నౌనే నిర
త్సురకుక్షింభరు లెందఱైన నొకశా(స్త్ర)జ్ఞుండు వాదించు దు
ర్భరయుక్తిం బెడనాభిధాన. ౧౭

మ. సమయాచార్యుఁడ వీవు శిష్యుఁడ నజస్రం బేను సత్యం బన
శ్యము నన్గావఁగ దాత వీవరయ యుష్మద్భక్తిభాగ్యంబు ని
త్యముగాఁగఁ భువి మించుఁ దద్యశము చేత న్మించు నీమూర్తి తి
త్త్వమయంబై పెడనాభిధాన. ౧౮

మ. సరసం బీఘటమందిరంబునను సుజ్ఞానాఖ్యదీపాంకురం
బురులీల న్వెలిఁగింపఁ జేయుట సురవ్యూహప్రధానుండవై
దొరవై చీఁకటియింట నుంట తగ దెందుం జూడ నీవే పరా
పరమేశా పెడనాభిధాన. ౧౯

మ. నెపమే నీవు జగద్గురుండ వనుచో నేఁ జేయుపాపంబు లే
దెపుడైనం గలదేని జెందు నది ని న్నే శిష్యపాపం గురో
రపియ న్వాగ్గతి నే నిరాఘుఁడ నిర............ధ
ర్మపరుల్ (శ్రీ)పెడనాభిదాన. ౨౦

శా. అంబాబింబఫలాధరేశ్వర శిరస్సాష్టాంగదండప్రణా
మం బే నిప్పు డొనర్తు నంత కభిరామం బెన్న లేదెందు ని
త్యం బేఁ జేసినతప్పు లన్నిటికి డాయన్రావె సుజ్ఞానదీ
పంబీవే పెడనాభిధాన. ౨౧

మ. మును దారాపతి దక్షశాపహతి నింపుం బెంపుఁ బోనాడి కూ
లిన వానిం దగ నెత్తి నెత్తి నిడి పాలింపంగ నిత్యాశ్రితుం
డను నిర్దోషిని నీదుకాళ్లకడ నైనం జేర్చి రక్షించు టొ
ప్పని దేనా పెడనాభిధాన. ౨౨

మ. గృహశల్యంబులు గూర్చి కట్టిన మరుద్గేహంబున న్నీదు వి

గ్రహము న్గావము నుంచి మ్రొక్కులిడువార ల్వేండి నిల్లోడ్డి ప్ర
త్యహము న్నినెడఁగట్టి పూజలిడు వార్ స్తవ్యాత్ములే లోకధూ
ర్వహ నీ కోపెడనాభిధాన. ౨౩

మ. హరుఁ డన్నన్ హిమవద్ధరాధరమనోహారికుమారీమనో
హరుఁ డన్నం త్రిజగచ్చరాచరశిరఃస్థాంచచ్ఛిరస్కృత్యసం
హరుఁ డన్న న్నిక శంకరుం డనఁగఁ నీవంచున్ భజింతుం బరా
త్పరుఁ డన్నా బెడనాభిధాన. ౨౪

మ. ఒకపూఁ టన్నము లేనివాని కెటు నోరూరంగ ముమ్మాఱు తిం
టకుఁగా నొక్కటఁ బంచభక్ష్యములు నింటం గల్గు నేవెంట నిం
చుక గల్గించిన నీదయారస మ టెంచున్ దాన నానావనీ
పకకల్పా పెడనాభిధాన. ౨౫

శా. శ్రీనాథాబ్జభవేంద్రముఖ్యదివిషచ్ఛ్రేణీమహోద్యన్మ
స్థానా మ్మస్తరమండపస్థగితవజ్రస్తూపవిద్యుత్ప్రభా
జ్ఞానాజ్ఞానతమోవిరామ విమలజ్ఞానాత్మవిద్యానవ
ధ్యానాంచత్పెడనాభిధాన. ౨౬

శా. ఏకాలంబు జగత్కుటుంబభరణం బేకాకివై యోర్తు విం
తేకాదా భువనైకమాత యనురక్తన్నాయమై యున్నచో
నీకెంతైన భరింపవచ్చు నిది వాణీరాట్సఖీ న్సక్యమూ
వాక్రువ్వం బెడనాభిధాన. ౨౭

శా. లోకానీకములోన దేహియనునాలో నాస్తియన్రాదు ము
న్నీకుం గట్టఁగ బట్టలేదు మఱి నిన్నే నెంత యాచించిన
న్నాకే మీవల దందు కిందొసఁగు నానందింతు నీభక్తియ
న్నైకం బే పెడనాభిధాన. ౨౮

శా. వేదార్థంబుల విందు నీతనుమహద్విఖ్యాతి నిత్యంబుగా
నీదం బోయినఁ ద్రావనీళ్లు మఱి లే విందన్నచందంబు ని
న్నాదిం జూడఁగ నేమిలేదు జగదాద్యం బెన్న నీవంచు నే
వాదింతుం బెడనాభిధాన. ౨౯

శా. అన్నా చిత్రము నీదు వైభవము నీవా షడ్గుణైశ్వర్యసం
పన్నాఢ్యుండవు చేదుబువ్వ పులితో లైపచీరయుం బూదిమే

గ్గన్నా చిచ్చగు నెమ్మొము నినుఁ గన్నం జాలు నీకల్గిమే
ల్వన్నేరా పెడనాభిధాన. 30

శా. అన్నా ము న్వలపించ నేర్చొనర ని న్నాపార్వతీదేవి నీ
కన్నం జక్కనివాఁడు లేఁడనుచు ని న్గామించి మోహించి ము
న్నెనో్న నోములు నోఁచి దాన నగ మయ్యె న్నీదుమే న్గారసం
పన్నం బై పెడనాభిధాన. 3౧

మ. అనుమానం బొక యింత లేదు నగమీా నై పోతి నీవున్న రూ
పానరం జెప్పినఁ బౌరుషంబు నగమై యొప్పారె నీజాడఁ జూ
డ నిజంబాడిన నిష్ఠురంబు వెనువెంట న్వచ్చు నాకేల నీ
పనియింతే పెడనాభిధాన. 3౨

శా. తల్లిం గానక తండ్రి పే రెఱుఁగ కా తన్వీలలామం బె మే
లిల్లు న్వాకిలి తోఁడునీడ యని నీ కిక్కింపఁ దచ్ఛక్తి నీ
వెల్ల న్ని వని లోఁ గనుంగొనియె నింకేమైన సందున్నదే
పల్లెత్తం బెడనాభిధాన. 33

మ. రసన న్నేల నయోక్తు లెంత ప్రియమూరం జెప్పినం బల్లకు
న్నసదాస్థాఁణుఁడ వంటి ని ట్లనుట కై నా గానరానైతి విం
తసిధారావ్రత మైన మంచివనరాదా యిప్పుడే యింత యీా
రసమేలా పెడనాభిధాన. 3౪

మ. జలగంధాక్షతపత్రపుష్పచయరాజద్ధూపదీపాదులం
గలకాలంబు నినుఁ భజించి నుతుల న్గావించి మెప్పించి లో
కులు నీయిల్లు గడంగి చూఱగొన నీకు న్నన్ను గొల్లగా
వలసెంగా పెడనాభిధాన. 3౫

శా. నీ వెందున్న సమస్తసంపదలు ముందే వేఁడి కొన్నంతలోఁ
గా వే యిచ్చి గణాధినాథులకొడల్ గైసేసి తద్భూతిచే
నావేశించి తిరింగ వెల్లెడల నీ యాచిత్యమే యింతగా
రావించెం బెడనాభిధాన. 3౬

శా. అయ్యయ్యో విష మేల తింటి వది నీ కాహార మెట్లయ్యె నా
నయ్యా కుత్తుక బంటి యున్నయది యట్లైన న్భయంబేమి నా
కుయ్యాలింపు సనాతనుండ వీఁక నీకుం జేటు రాదెప్డు నా

పయ్యాసం బెడనాభిధాన శివపూర్వస్త్యాద్యగస్త్యేశ్వరా. ౩౭

మ. క్షమియింపందగు నెన్నఁబూనిన నశక్యం బస్మదీయాపరా
ధము లెన్నైన విడంగ నౌనె నిజసంతానం బదెంతెంత త
ప్పు మదింగూర్చినఁ గన్నతండ్రి మది నీ మోదంబు లోకాహిత
ప్రమదంబా పెడనాభిధా. ౩౮

మ. ధనదప్రాణపదంబు ధీరజనసంతానంబు నీపాదద
ర్శనమైతే నదిగల్గుటే యరిది గాంచం గల్గిన న్లోపమే
లనగుం బెన్నిధిఁగన్నపేద కిఁక నేలా చింతిలం గోర్కిగీ
రనుతింతుం బెడనాభిధాన. ౩౯

మ. నుతియింపం గడ గానలేరెవరు నిన్నుం ధాత నిన్నీదు వి
శ్రుతరూపంబు గణింపలేక చతురాస్యుం డయ్యె శేషుం డధో
గతిపాలయ్యె శ్రుతు ల్చికాకుపడియె న్గా నీమహత్త్వంబు శా
శ్వత మయ్యెం బెడనాభిధాన. ౪౦

మ. జగతిం బుట్టినదాదిగాఁ గుటిలసంసారాంబుధిం ద్రోచి నె
వ్వగలం దొంగతనంబునం దిరుగు టోర్వంజాలఁ దచ్చౌర్య మో
నిగమాంతర్గత చూడు పట్టుపడితేనిం భక్తిబంధించి నా
పగ నీస్తుం బెడనాభిధాన. ౪౧

శా. ఆబాణాసురుఁ డేమిమందిడెనొ నీకాయింటివాకింటఁ గా
పై బంట్లైయనుంట నాయుపమ నాయాదున్న నాలోసనా
శాబంధంబున నుందు వీవు దొరవై సత్యంబు సందేహమే
ప్రాఁబల్కు ల్పెడనాభిధాన. ౪౨

మ. కరుణాంతఃకరణంబు నీదనుచునేఁ గాంక్షింప నింద్యాక్షకే
సరిగాఁ జూచెద వింతె చాలు నది ముం జట్రాతిరాముద్దుఁగూఁ
తురిసయ్యాటల గట్టిదేటినది యాదుం గట్టిగాదే దయా
వరణంబై పెడనాభిధాన. ౪౩

మ. ప్రమథాధ్యక్ష మహోక్షసైంధవ జగద్బంధో దయాసింధవేం
దుమణిస్ఫాటికసన్నిభాంగరుచయే తుభ్యం నమో దేవదే
వ మహాదేవ దృఢప్రభావ చిదచిద్వ్యాపార మాంపాహి స
ర్వమనోద్య త్పెడనాభిధాన. ౪౪

మ. అనభిజ్ఞోన్నదభాగ్యగర్వచలనోద్యద్విస్మృతు ల్బాల్యయౌ
వనకౌమారజరాంతకాలముల సంప్రాప్తంబు లిందొక్కవే
ళ నినుం బ్రస్తుతిసేయఁగందు నని యేలా యుందు నందున్న నీ
వని విందు న్బెడనాభిధాన. ౮౫

శా. నానాశాస్త్రపురాణవేదపఠనానందం బదెంతైన వి
జ్ఞానం బన్నది లేక వేఁడిన విశేషం బేమి బోధింప వి
జ్ఞానం బద్దములోనఁ జీకు గనునాచందంబు నన్నెంచు నీ
వానింగాఁ బెడనాభిధాన. ౮౬

శా. జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలను నీసంసారమూహింప న
త్యుగ్రం బ్బుక్కట దుఃఖభాజనమునం దుత్సాహముం బొందు భా
వగ్రంధి న్నడలించి ప్రోవు మని నిన్ బ్రార్థించితిన్గాదె మ
... ... ... ... ... ౮౭

మ. సిరి దాఁ జేరినఁ జేరుఁగాక జనరాశిన్ ధర్మకీర్తిద్వయం
స్థిర మన్నద్ధతి రెండుదప్ప మఱి యేదీ మర్త్యలోకంబునం
దరయన్ శాశ్వత మన్న దింకొకఁడు నీయందమ్యె సర్వం బవాం
తరలీల న్బెడనాభిధాన. ౮౮

శా. శ్రీమంతుండవు భక్తబాంధవుఁడ వుత్కృష్టార్థసీమా మహో
ద్దామా బిడ్డలఁ గన్నతండ్రి వెద నిర్దాక్షిణ్య మింతేల యో
స్వామీ నీశరణాగతుండ నిఁక నాపైఁగూర్మిరానీ శివా
వామాంగా పెడనాభిధాన. ౮౯

శా. ప్రాలేయాచలకన్యకాప్రియ భవత్పాదారవిందార్చనా
లోలుండై హరి నేత్రపద్మమునఁ దళ్ళుల్చిల్లుఁగాఁ బూన్చి త
త్కాలాచిత్యము దీర్చికాంచెఁ గద నీకారుణ్యముం దా జగ
త్పాలుండై పెడనాభిధాన శివపూర్వస్వామ్యగస్త్యేశ్వరా. ౯౦

శా. ఆర్యాలోల మదీయవర్తనము సవ్యంబైనఁ గాకున్న నా
దార్యప్రక్రియ కేమి లోపమగు నర్థప్రాణము ల్రెండు నా
చార్యాధీనములే కదా తుదకు నీసందేహముం దీర్ప దు
ర్వార్యంబా పెడనాభిధాన. ౯౧

శా. ఏ నిన్నమ్మితి నమ్మినందుకు మదీయేష్టార్థసంసిద్ధి నీ

చే నేనాఁటికి నా నిదేమి పనిగాఁ జిత్తంబునం దోఁచె ని
ష్ఠైనం బ్రాణము లైదు నీకొసఁగి నీయం దైక్యమేఁ గాంతునా
రా నీతి న్బెడనాభిధాన. ౫౨

శా. పూర్వజ్ఞానము లేనివాఁడ నను సంబోధించి వేవేగ మ
ద్గర్వంబంతయుఁ గూల్చి భక్తినిరతుం గావించి రక్షింపవే
సర్వాభీష్టఫలప్రదాత వయి నాస్వామీ కృపాదృష్టిమైఁ
బర్వ శ్రీపెడనాభిధాన. ౫౩

శా. నీనామస్మరణంబె పావనముగా నిష్ఠం బ్రవర్తించు వి
జ్ఞానాత్ముండు కృతార్థుఁ డౌటరుదె దుశ్చారిత్రుఁ డైనం గళా
హీనుం డైనను ముక్తుఁ డౌఁ బరశివాయే త్యక్షరాంతస్సుధా
పానాప్తిం బెడనాభిధాన. ౫౪

శా. నీవాక్కుండవు దప్ప నన్నెఱిఁగి మన్నింపంగ వేల్పుల్గుం
డేవంకం గలఁ డయ్య నాయెడల లేఁ డేవంక నీవింక న
న్నావంగాఁ దగుఁ బంకజాక్షులకు బాంధవ్యంబు నిత్యంబె సం
భావింపం బెడనాభిధాన. ౫౫

శా. నీసౌందర్యముఁ జూచి మోహినియునై నీకేశవ స్త్రీలు
డేసైరింపక మున్ను మానివనవాటిం గూడె నిన్నన్న పే
రాస ల్బాసటమై నటింప మునిభార్యల్గూడి సేవించు లే
త్రాసంబా పెడనాభిధాన. ౫౬

శా. కైలాసం బనిశంబుఁ జేరుఁ సుమహాబ్రాండంబు నాపాలిప
జ్జాలంబుల్ గెడతోడునీడలయి నీజాడం బ్రవర్తింతు రా
లాలిత్యంబు విచిత్ర మందు నిను నేలాగంను నీకీర్తన
జేలా నా పెడనాభిధాన. ౫౭

శా. కాదే రోగికి మృత్యుసన్నిహితమై కన్పట్టునావేళ నా
నాదివ్యౌషధమంత్ర తంత్రముల నానాపత్రపహారంబు నా
నాదిప్రాప్తశివాక్షరద్వయి నదే నల్లిప్పు డీఁగాంతు నీ
పాదంబు న్బెడనాభిధాన. ౫౮

మ. తనకుం గల్గి గలంతకాల మెపుడుం దానంబు ధర్మం బటం
చును బుద్ధింతయు లేక తాఁజొనిన దుర్దారిద్ర్యముం జింత నే

సిననేమూ నది శైల మేదినతుదిం జింతింప దీపత్ప్రకో
పనమూనా పెడనాభిధాన. ౫౯

మ. మును గావించిన పుణ్యలేశమున నేమో కూడు జే కాని స
ద్వినియోగంబున కందరాని ధన మన్వేషింపనేఁ గాక చో
రనరేంద్రాజ్ఞలచేతఁ దక్కు నెడ నర్థప్రాశికి న్వాటిక
ల్పన గాదే పెడనాభిధాన. ౬౦

మ......హితకంఠభూషణము రం గుల్లితి తద్వల...
గణనం బైనవధూశిరోధి నెడలంగా ధర్మరాహిత్యమై
గుణముంటం దలకొన్న భాగ్యము దొలంగుంగాక సంధిల్లునా
ఫణిభూషా పెడనాభిధాన. ౬౧

శా. ధర్మం బర్జునభూమిభృత్తిలక మే తద్ధర్మ్యం బన
త్రిర్వవ్యూహనికృంతనం బగుట సాధ్యంబన్న నీ కింతకుఁ
ధర్మంబన్నది యున్నఁ గాచికొను పథ్యం బాద్యదేహప్రభా
పర్మంబే పెడనాభిధాన. ౬౨

మ. అలసన్న్యాసికి లేదు తస్కరభయం బాభీతి సామ్మున్నవా
రలకే వారిది లేమిగా దది దరిద్రప్రాణులంబైన ని
శ్చలపూ భక్తిధనంబుకల్మి ధనికు లనత్యం బదే నాపద
ల్వలగొన్నం బెడనాభిధాన. ౬౩

మ. అతిలోభిం గనుఁగొన్న యాచకజనం బాకాంక్షమై నర్థసం
తతి యార్జించు నె దాతలం గనిన పేదల్బంగి నీదర్శనో
న్నతి నింపొందు సమస్తభాగ్యశుభకందం బిందు కెందేది సం
ప్రతిచూడ న్పెడనాభిధాన. ౬౪

శా. శిష్టాచారము లేల గ ల్గకుచి కిక్షింపంగ యావజ్జనో
చ్ఛిష్టగ్రాహికిఁ గల్గు నెట్లు రుచి భక్షింపంగ నీ రెండుఁ జెం
దష్టైశ్వరసమిద్ధభోగి కిల నీ యాశీర్వచఃప్రాభవా
వ్యష్టిఁ శ్రీ పెడనాభిధాన. ౬౫

శా. ఇంటింటం జని వంటకంబు గొనలే కిట్టట్టుగాఁ బెంటలో
కంటం బంటను బట్టి గీరికొని సాయంబైన కాకంబులా
యంటంటం జెయిపీచుచు న్మెనఁగు నిత్యాశాశుచిగ్రాహి ని

...టానా పెడనాభిధాన శివపూర్వస్త్వాద్యగస్త్యేశ్వరా. ౬౬
మ. కలకాలంబు గురూపదేశ విదితజ్ఞానంబులే కాత్మచం
చలమై విస్మృతిఁ జెందునప్పు డెదలో శంకించుమూఘుండు దాం
గలుపజ్ఞార్ణ్ణలకుక్కజా్వ్వ మనుసంజ్ఞం దెల్పి ముందున్నదే
ఫలమింతే పెడనాభిధాన. ౬౭
శా. నీసద్భక్తి విహీనులై తిరుగు దుర్నీతు ల్బుధి న్మోక్షుల
క్ష్మీసాంగత్యము గాంతురే నిజము గాసిందప్పి చింతిల్లకఁ
భాసిల్లం గలదే యనాఘలకు సౌభాగ్యంబు తత్సంగళ
ప్రాసంబై పెడనాభిధాన. ౬౮
శా. బాలక్రీడల కెల్లమూల మగు సంభావించి యాడించు నీ
లీలామానుషవిగ్రహంబు విధికేళి న్నిల్పుఁ జాలించినం
గీలూడం బడు జంత్రపుం బ్రతిమవఁహ్మాక్షిం గ్రాలు నీవేతగుం
బాలింపం బెడనాభిధాన. ౬౯
శా. తోఁడేళ్లన్న మృగంబులట్లు మది............
లాడింపంగ నెఱుంగలేక యము డాయంబోవు మర్త్యాళికిం
జూడం జుట్టము మ్రొక్కు దైవము మదిఁ శోధింప నీకంటె నె
వ్వాఁడీవే పెడనాభిధాన. ౭౦
మ. సకలాఘర్మతరంగసంగతము సంసారార్ణవం బండుఁ బొం
దికగా మత్తిలి యున్న చిత్తి మనురక్తిం జేసి వైరాగ్యమా
ర్గకళావ్యక్తి నెఱుంగ నీఁగకును సౌగంధ్యంబు సొంపౌను ద
ర్పకభంగా పెడనాభిధాన. ౭౧
శా. ఎందుం దోడయి నిల్చియుండఁ డరి నీవెందున్న నీయుండె నా
డెందం బిందుకు సందియంబువల దుండె న్భవ్యత్వత్పాదమిం
పొంద న్మట్టుచు బాసచేసెద నిదే యూహింప నీకాళ్ళకుఁ
బందం బౌ పెడనాభిధాన. ౭౨
మ. ధరఁ బుట్టింపఁ గరంబుఁ బెంప ననుసంధానంబు గావింప నే
ర్పరివై సర్వ మనుగ్రహింప ననుఁ బ్రోవన్నీ కసాధ్యంబె యిం
దరవిందప్రభ చిత్రభానున కనాహ్లాదంబె నాతంద్రి నీ
వరవుండం బెడనాభిధాన. ౭౩

# ఉచితము, ఉచితము.

గౌరీ, తులసీ, సంతాన, గోపాలపూజలు.

---

అను పూజాత్రయములుగల చిన్నసైజు గ్లేజుకాగితములతో ముద్రించిన గ్రంథమును ఈప్రజోత్పత్తి సంవత్సర వైశాఖ శుద్ధ నవమీ ఆదివారము (26-4-31) రాత్రి 11 గంటలకు శ్రీమత్పాండురంగనాథుని సంస్మరించుచు కీర్తిశేషురాలయిన నాధర్మపత్నియగు,

కనుపర్తి రామమ్మ

యొక్క అభిప్రాయానుసారము స్త్రీరత్నముల కత్యావశ్యకమగు పై గ్రంథమును అభిలషించువారికి ఉచితముగా పంపుచున్నాము. అపేక్షించువారు వెంటనే మాకు వ్రాయవలయును.

ఇట్లు,

కనుపర్తి మార్కండేయశర్మ.

ఎడిటరు, స్వధర్మప్రకాశిని, నెం 82 పూనమల్లి హైరోడ్డు,

బృందావనము, కీలుపాకుపోష్టు, మదరాసు.

---

Printed by N. Achutaramiah at the Cocanada Printing works, Cocanada.